HETU VADI

# హేతువాది

Monthly Journal devoted to Science, Rationalism & Humanism

హ్యూమనిస్ట్ సెంటర్-హేతువాద సంఘం.
జైనా! వేదంలో అన్నీ ఉన్నాయా?-7
ఆత్మ?
సత్తు - చిత్తు సమస్య
ఆధునిక యుగం
విజ్ఞాన ప్రవాహంలోని గుంట చిక్కులు.
బ్రతుకు నినాదాలు
ద్రవిడవాదం మిథ్యా! - ఆర్యవాదం సత్యమా ?
భాష పుట్టుక
సల్లకొచ్చి
ప్రశ్నోత్తరాలు

195/800

274




సంపుటి : 26
సంచిక : 6
ఫిబ్రవరి. 2008
వెల : రు. 20/-

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ 17వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక

ప్రధాన సంపాదకులు : రావిపూడి వెంకటాద్రి

C

హేతువాది

సంపుటి : 26 సంచిక : 6

ఫిబ్రవరి, 2008

ప్రధాన సంపాదకులు :

**రావిపూడి వెంకటాద్రి**

☎ : 08594 - 233403

cell : 9989223042

**E.mail :**

**Ravipudi2007@rediffmail.com**

చందాలు, విరాళాలూ, వ్యాసాలు

పంపవలసిన చిరునామా :

**మేడూరి సత్యనారాయణ**

మేనేజింగ్ ఎడిటర్

C/o రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్

ఇంకొల్లు - 523 167. ప్రకాశం జిల్లా

ఫోన్ : 08594 - 244589

**Cell : 98499 35117**

**Fax : 08594 - 244431**

**E.mail :**

meduri_satyanarayana@yahoo.com

| | |
|---|---|
| జీవిత చందా | రూ. 1,000/- |
| సాలుచందా | రూ. 100/- |
| విడిప్రతి | రూ. 10/- |

**ABROAD Subscription**

**Annual $100, £ 75**

**Life $1000, £ 750**

ఇందులో....





2008 ఫిబ్రవరి9,10 తేదీలలో జరుగుతున్న

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు

17వ వార్షికోత్సవాన్ని విజయవంతం చేయవలసిందిగా ఆహ్వానిస్తున్నాం.

రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్,

ఎడిటోరియల్



# హ్యూమనిస్టు సెంటర్-హేతువాద సంఘం.

హేతువాద సంఘాల అవతరణ, వ్యాప్తి గురించి "హేతువాది" పత్రికలో చాలసార్లు చెప్పుకున్నాం. హ్యూమనిస్టు సెంటర్‌తో దానికున్న సంబంధాన్నే ప్రత్యేకంగా చెప్పుకోలేదు.

1930లో బొంబాయిలో RAI గా అవతరించిన హేతువాద సంఘం 1940 దశకంలో నిస్తేజంకాగా, 1950లో మద్రాసులో అది RAI గా ప్రారంభమైంది 1958లో మద్రాసులో, 1960ల హైద్రాబాదులో జరిగిన భారత హేతువాద సంఘ మహాసభలకు హాజరయిన వారు నాతో కలిపి 15 గురికి మించలేదు. నేను ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షుణ్ణి అయ్యాక 1980లో బొంబాయిలో జరిగిన RAI సభలకు హజరయిన వారలం 12 మందిమే.

ఆంధ్రప్రదేశ్‌లో IRA అధ్వర్యాన జరిగిన ఏ.టి.కోవూర్ పర్యటనవల్ల ఇక్కడ హేతువాద ధోరణి ఉవ్వెత్తున లేచినట్లు కనిపించింది. దానితో స్ఫూర్తి పొందిన తోటకూర వెంకటేశ్వర్లు "చార్వాక" మాసపత్రిక ప్రారంభించి, దాని అధ్వర్యాన 1977,78,79లలో విజయవాడలో విస్తృత స్థాయిలో హేతువాద అధ్యయన తరగతులు నిర్వహించారు. అదే తీరున ఇతర ప్రాంతాల్లో అధ్యయన తరగతులు నడిచాయి. వాటి ప్రభావంతో సమీకృతమైన మిత్రులు 1979లో RAI కు అనుబంధంగా ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘాన్ని యేర్పరచుకున్నారు. ఆ సంఘానికి 1979-89 మధ్య పదేళ్ళ పాటు అధ్యక్షుడిగా వున్న నేను దానికి హ్యూమనిస్టు మలుపు యిచ్చాను 1982లో 'హేతువాది' మాసపత్రికను ప్రారంభించి దాని నీడన 100పైగా గ్రంథాలను ప్రచురించాను. 1989-2002 మధ్య భారత హేతువాద సంఘ సారధ్య బాధ్యతను యువకులకు అప్ప జెప్పాలనుకున్నాను. అప్పటికే నా వయస్సు 80కి దాటింది. భారత సంఘాధ్యక్షుడిగా వున్న నా చుట్టూ ఉద్యమం కేంద్రీకృతం కారాదని భావించి ఇంకొల్లులోనే ఓ విస్తృత హేతువాద సంఘ సమావేశంలో ప్రధమ ఉపాధ్యక్షులు కుర్రా హనుమంతరావుకు 2002లో అధ్యక్ష బాధ్యతలు అప్పగించాను.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం యేర్పడినప్పటినుంచి యిప్పటివరకు పటిష్టంగా పనిచేస్తున్నది. ఇక ముందూ అలాగే చేస్తుంది. విస్పష్టమైన సిద్ధాంత భూమికతో అది సాగిస్తున్న కృషే భారత హేతువాద సంఘ కృషిగా పరిగణించబడుతోంది. వాటి రెండిటి కృషి ఇక్కడ సంయుక్తంగా జరగడమే అందుకు కారణం. ఎర్నాకుళం. త్రివేండ్రం, కొల్లం, ఢిల్లీ మొదలైన ఆంధ్రేతర ప్రాంతాల్లో జరిగిన భారత హేతవాద సంఘ మహాసభలకు ఆంధ్రప్రదేశ్ నుంచి 15-25 మంది దాక ప్రతినిధులం హాజరవుతూ వచ్చాం. 1999లో బొంబాయిలో జరిగిన IHEU మహాసభలకు ఆంధ్ర ప్రాంతంనుంచి హాజరయిన 120 మందిలో 75 మందిదాక ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంవారే. అప్పుడు వీరికి జరిగిన సత్కారాలు ఇప్పటికీ మరచిపోరానివి. ఒకప్పుడు ఓ హైదారాబాదు సమావేశాలకు 10 మందిమి హాజరయితే, ఏమిటి తెలుగోళ్ల గుంపును కొట్టుకొచ్చారన్న రిమార్కు జ్ఞాపకం వుంది.

ఆంధ్ర ప్రాంతంలో హేతువాద సంఘ కార్యకర్తల కృషివల్ల ఏటేటా మూడు నాలుగు అధ్యయన శిబిరాలు, వార్షిక-ద్వైవార్షిక సభలు జరుగుతున్నాయి. సంఘ కార్యకర్తలు వందలాది సభల్లో ప్రసగించారు. 1979 లగాయితు యిప్పటికీ ఆ కృషి ఆంధ్రలో జరుగుతూవుంది.

2004లో ఒంగోలులో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ రజతోత్సవం ఎంతో

ఉత్సాహభరితంగా జరిగింది. 2006 లో త్రివేంద్రంలో భారత హేతువాద సంఘం నుంచి 20 మంది ఆంధ్ర ప్రతినిధులు హాజరవడమేకాక, తమవంతుగా విలువైన ప్రత్యేక సావనీరును, మెమెంటోలను అందిందచారు. తిరిగి 2007 ఆగస్టులో ఇంకొల్లు రాడికల్ హ్యూమానిస్టు సెంటర్ భవనంలో "హేతువాది" పత్రిక రజతోత్సవాలను సమధికోత్సహంతో జరుపుకున్నారు. ఆసందర్భంగా రు. 11000/-కు హేతువాద హ్యూమనిస్టు సాహిత్యం అమ్ముడు పోయింది. ఆంధ్రప్రదేశ్ లోని హేతువాద సంఘ క్యాకర్తలు ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటరును హేతువాద సంఘంలో ప్రధానాంగంగానే భావిస్తున్నారు. ఆ సెంటరు 2008 ఫిబ్రవరి 9,10 తేదీలలో 17వ వార్షికోత్సవం జరుపుకొంటున్నది.

భారత హేతువాద సంఘానికి అనుబంధమైన కేరళ యుక్తివాద సంఘం కూడా వారిస్థాయిలో నిత్యమూ చాల కార్యక్రమాలు చేస్తున్నారు. మళయాళ భాషలో పత్రిక, సాహిత్యం ప్రచురిస్తున్నారు. అయితే, భారత సంఘానికి గాని, ఆంధ్ర-కేరళ సంఘాలకుగాని మూలధనమేమీలేదు. స్వచ్ఛంద కార్యకర్తలే వాటి మూలధనం. ఈ సంఘాలకు అవసరం మేరకు ఎప్పటికప్పుడు విరాళాలందిస్తున్న దాతల్లో అత్యధిక సంఖ్యాకులు హేతువాదులే. తాము చేయజాలనిది ఇతర స్వచ్ఛంద కార్యకర్తలు చేస్తున్నారనే సంతృప్తితో కూడిన సంతోషమే వారి దాతృత్వానికి అర్థం. నిజానికి, హేతువాద సంఘ కార్యకర్తలందరూ మధ్యతరగతి-క్రింది మధ్య తరగతికి చెందినవారే. ఎవరికివారు ఏదో వృత్తి, లేక ఉద్యోగం చేస్తూ, తమ విరామకాలాన్ని హేతువాద వ్యాప్తికి స్వచ్ఛందంగా కృషిచేస్తున్నవారే. అయినా, వారిలో చాలమంది ఈ సంఘంలో భాగస్తులయ్యాక మంచి ఉపన్యాసకులుగా,రచయితులుగా, గ్రంథ కర్తలుగా, అన్నిటికీమించి స్వతంత్ర ఆలోచనా శీలురుగా పెంపొందడం గర్వించదగిన విషయం, అలాంటి వారిపై అనావశ్యక దురభిమానం పెంచుకొని, "ఈసంఘంలో వారుండరాదు, వీరుండరాదు, వారుంటే నేను దూరమవుతాను" అని బెదిరించడం సరికాదు. ఈ సంఘం ఏ ఒక్కరి సొత్తూకాదు, లిమిటెడ్ కంపెనీ అంతకు ముందేకాదు. ఈ సంఘ నుంచి పొమ్మనకుండా పోయే వారి సంఖ్య కంటె రమ్మనకుండా వచ్చేవారి సంఖ్య చాల యెక్కువ.

గుజరాత్‌లోని పాలన్‌పూర్ 'లా కాలేజి' ప్రిన్సిపల్ అశ్విన్. ఎన్. కరియా మరో యిద్దరు సభ్యులతో త్రివేంద్రం ప్లాటినం సభలకు హాజరయ్యారు. తాము గుజరత్-ముంబాయి హేతువాద సంఘం యేర్పరచి, భారత హేతువాద సంఘానికి అనుబంధం చేస్తామనీ, అక్కడ RAI మహాసభలు యేర్పాటు చేయాలనీ కోరారు. మేము అంగీకరించాము. వారు 2007 నవంబరులో RAI సభలతోపాటు గుజరత్ బొంబాయి హేతువాద సంఘ మహాసభలను పాలన్‌పూర్‌లో యేర్పాటుచేసి, భారత హేతువాద సంఘ ప్రతినిధులను ఆహ్వానించారు. అదే తరుణంలో మతకల్లోలాలకు పేరుపడ్డ గుజరాత్‌లో రాష్ట్రశాసన సభకు ఎన్నికలు జరుగుతున్నాయి. అక్కడి వాతావరణంలో సభలు వాయిదాపడే అవకాశాలున్నవనే అనుమానం ఆంధ్రప్రాంతం వారిలో వుండడం వల్ల, వారు సకాలంలో రైల్వేరిజర్వేషన్ చేయించుకోలేక పోయారు. నెల ముందుగానే నలుగురు హేతువాద మిత్రులు రిజర్వేషన్ సాధించగా, అది 300 వెయిటింగ్ లిస్టులో చేరింది. వారు చివరి క్షణం వరకు చీరాల రైల్వే స్టేషన్‌లో రిజర్వేషన్ ఖరారు కోసం ఎదురుచూచి, అది ఖాయం కాకపోగా, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ప్రధానకార్శి మేడూరి సత్యనారాయణగారొక్కరే

కామన్ బోగీలో ప్రయాణం చేసి పాలన్‌పూర్ చేరారు. రాజస్థాన్ సరిహద్దుల్లో వున్న పాలన్‌పూర్‌కు రిజర్వేషన్ లేకుండా రైలు ప్రయాణం చేయడం చాలాకష్టం. అందుకే మిగతావారు తమ టికెట్లు కేన్సిల్ చేయించుకున్నారు.

ఆంధ్ర ప్రతినిధులు సభలకు రాజాలనందుకు కరియా ప్రభృతులు నిరుత్సాహపడి ఆంధ్రసంఘంపై ఏ ఆరోపణలనైనా చేయడాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. కాని, ఆ సభలకు అతిథివక్తగా హాజరయిన ప్రముఖులు భారత హేతువాద సంఘంపై దారుణమైన అభియోగాలు చేయడమే అర్థం కావడంలేదు. నిజానికి, ఆ అభియోగాలు నన్ను ఉద్దేశించనవిగానే నేను భావిస్తున్నాను. భారత హేతువాద సంఘ ఛైర్మనుగా ఆ అభియోగాలపై సంజాయిషీ యివ్వకపోతే, నేను వాటిని ఆమోదించినట్లవుతుంది. కాని, అంతటి అసహాయస్థితిలో నేను గాని, భారత హేతువాద సంఘం కాని, దాని కార్యకర్తలుగాని లేనేలేరని చెప్పక తప్పడంలేదు.

"భారత హేతువాద సంఘాన్ని ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటర్‌కు తీసుకువెళ్లి చంపారనే అభియోగం' అర్థం లేని అభాండం. మరి, అది ఇంకొల్లు పోక, చీరాలలోనే వుంటే బ్రతికి వుండేదా? పాలన్‌పూర్ సభలకు వెళ్లని ఆ సంఘ ప్రధాన కార్యదర్శి చీరాలలోనే వున్నారు. ఆ బాధ్యతనే మోయలేక ఆయన బాధపడుతుంటే, ఆయన మూపున ఇండియన్ రాడికల్ హ్యూమనిస్టు సంఘ అధ్యక్ష పదవిని మోపడం దాన్ని సైతం చంపడానికేనా? తీరిక కలిగి నెత్తికెత్తుకొని దాన్ని బ్రతికించగలవారు మరెవ్వరూ దొరకలేదా? దీన్ని బట్టే చీరాల, ఇంకొల్లుల ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోవాలి.

భారత హేతువాద సంఘం చచ్చిపోయిందనుకునేవారు కలలు కంటున్నారు. ప్రచ్ఛన్నమతవాదులు, ప్రత్యక్ష రాజకీయవాదులు ఈ సంఘంలో దూరడానికి ప్రయత్నాలు చేయకపోలేదు. అలాంటి వారిని సంఘంలో చేరనీయనందుకు విషప్రచారాలకు తలపడ్డారు. వారి చేరిక ఈ సంఘాన్ని కలుషితం చేస్తుందని మాకు తెలుసు. అనివార్య కారణాల వల్ల ఒకే ఒక సమావేశానికి భారతహేతువాద సంఘం ప్రతినిధుల్ని పంపించలేక పోయినంత మాత్రాన ఈ సంఘం చచ్చిపోయినట్లేనా? అందుకు కారణం ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటరు దానికి ఆశ్రమమివ్వడమా? ఏమి విచిత్ర తార్కిక నిర్ణయమండీ ఇది?

బొంబాయి, మద్రాసు -హైదరాబాదులలో పనిచేసిన భారత హేతువాద సంఘాలిప్పుడేమయ్యాయి? భావోద్యమాకు ప్రాతినిధ్యం వహించే సంఘాలు ఒక చోటకాకపోతే మరొకచోటికి తరలిపోతుంటాయి, అవి చావవు. RAI చావకుండా బ్రతికి వ్యాప్తి కావడానికే చీరాలకు చేరింది. చీరాలలో చచ్చిపోనిది ఇంకొల్లు పోయి చచ్చి పోయిందనేది దురాశాపూరిత అభాండం. సంఘం నుంచి దాని బాధ్యులు తప్పుకొని, దాన్ని తమకు అప్పగిస్తే, దాన్ని తాము బ్రతికించగలమనేదాన్ని దురాశ అనాలా, అహంకారమనాలా? ఇలాంటి గొంతెమ్మ కోరికలవారు తమ ప్రాంతాల్లో ఇంతవరకు ఎంతకృషి చేశారు, ఏమి సాధించారు? ఆసక్తి పరులు ఎవరికివారు ఈ ప్రశ్న వేసుకోవాలి. సంఘాన్ని మాకివ్వండి, మేము పొడిచేస్తాం అనే కోతలవల్ల పదవులురావు. ఆ మధ్య ఓ దుందుడుకు పిండం నా వద్దకు వచ్చి, నన్ను హేతువాద ఉద్యమ బాధ్యతల నుంచి తప్పుకొని, సంఘాన్ని తమ పరం చేయమన్నాడు. అది మరికొందరి అభిప్రాయమన్నాడు. నేను తప్పుకోవడానికి అంగీకరించి 1. హేతువాద సంఘం 2. హేతువాది పత్రిక 3. హేమా



3

ప్రచురణలు తీసుకోమన్నాను. హేమా ఫౌండేషన్ కూడా తమకు యివ్వకపోతే, అవి మాకక్కరలేదన్నాడు. హేమా ఫౌండేషన్ లక్ష్యాలువేరు, అది నా స్వంతం కూడా కాదనగానే ఆయన లేచిపోయాడు. అంటే ఆయనకు హక్కులు కావాలికాని, బాధ్యతలు పనికిరావు. లోగా సంఘ చీలిక పాఠాలు గుర్తున్నందువల్ల ఈ సంఘాన్ని ఎవరైనా హైజాక్ చేసినప్పటికీ, సంఘ ఆశయాలకు కట్టుబడి ప్రవర్తించగలవారికి చేయూత యివ్వడానికే హేమా ఫౌండేషన్ స్థాపన ఉద్దేశించబడింది. సంఘాధిపత్యం కావాలన్న వారు ఈ ఫౌండేషనులో సభ్యులు కూడా కాదు. దాని సభ్యత్వరుసుం రు.25000/-రు.10,000 రు.5,000/-గా వుంది. దారినపోయే దానయ్యలకందులో చోటులేదు. భావోద్యమాలలోని పదవుల్ని బాధ్యతలుగా అర్థం చేసుకోవాలి. నిజానికి, నన్ను వెంబడించి బ్రతిమిలాడి మొదట ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘానికీ, ఆ తరువాత భారత హేతువాద సంఘానికీ అధ్యక్ష బాధ్యతలు అప్పగించారు. వాటిని పదవులని నేను ఎన్నడూ అనుకోలేదు. ఎవ్వరి మీదా అధికారం, అజామాయిషీ చలాయించలేదు. ఈ సంఘానికి సభ్యత్వరుసుం లేదు. పని చేయదలచుకున్న వారంతా చేయవచ్చు. బహిష్కరణలు క్రమశిక్షణ చర్యలు వుండవు. సంఘం నుంచి ఎప్పుడైనా, ఎవరైనా ఐచ్ఛికంగా వెళ్లిపోవచ్చు, ఎవ్వరినయినా బలవంతంగా వెళ్లగొట్టే వైఖరి ఈ సంఘపరిధిలోకి రాదు.

ఉద్యమశ్రేయస్సుతో హేతువాద సంఘాన్ని నడపడానికి స్వచ్ఛంద కార్యకర్తలు కావాలి. దానిలోవున్న పాలకవర్గం కూడా స్వచ్ఛంద కార్యకర్తలే. వీరి కృషికి ఎవ్వరూ వేతనాలివ్వడం లేదు. వేతనాలివ్వగల స్థాయిలో ఈ సంఘంలేదు. కార్యకర్తలంతా అవసరపడినప్పుడు ఎంతో కొంత చేతిడబ్బులే వదలించుకుంటారు.

కొన్ని సంఘాలకు Paid workers, జీతం డబ్బులు పుచ్చుకొని పనిచేసే కార్యకర్తలుండే మాట నిజమే. ఒకప్పుడు భారత కమ్యూనిస్టు పార్టీకి పెయిడ్ వర్కర్స్ వుండేవారు. అందులో చాలమంది కుటుంబంలో తమ వాటాకు వచ్చిన ఆస్తిని పార్టీకిచ్చి, తమ పార్టీ ప్రచారానికి పార్టీనుండి వేతనాలు పొందేవారు. అదే తరహాలో తాముకూడా తమ ఆస్తుల్ని రాడికల్ డెమోక్రటిక్ పార్టీకి యిస్తామని ఒక ఆంధ్ర పార్టీ ప్రముఖుడు 1946 దేరాడూన్ అధ్యయన శిబిరంలో ప్రతిపాదించినపుడు ఎం.ఎన్.రాయ్ తీవ్రంగా ప్రతిస్పందించాడు. "మీ ఆస్తులు పార్టీకిచ్చి, మీరు పాపర్లుగా మారి, పార్టీ యిచ్చేవేతనాలతో పార్టీకార్యక్రమాలు చేయాలని ఆశిస్తున్నారా? పార్టీకి స్వచ్ఛందంగా కృషిచేయలేరా?" అని ప్రశ్నించాడు. అంటే ఏ ఉద్యమాల్లోనయినా జీతాలకోసం పనిచేసేవారు స్వచ్ఛందంగా ఉద్యమ శ్రేయస్సుకు పనికిరారని అర్థం. పార్టీ రద్దుకు పునాదులుపడ్డ శిబిరం అదే.

బొంబాయిలో IRA పుట్టి 77 యేళ్లయింది. సంఘ కార్యాలయానికి ఒక్కగదినైనా నిర్మించుకోలేకపోయింది. మద్రాసులో RAI పుట్టి 57 యేళ్లయింది. మద్రాసులోకాని, హైద్రాబాదులోకాని సంఘ కార్యాలయానికి ఒక్కగదినైనా నిర్మించులేకపోయింది. IRA ఢిల్లీచేరి 17 యేళ్లయింది. నిస్తేజమైందికాని, కార్యాలయాన్ని నిర్మించుకోలేదు. అది చీలి RAI గా చీరాల చేరి 11 యేళ్లయింది. 17 యేళ్ల ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటరు 4 యేళ్ల క్రితం స్వంత భవన నిర్మాణం పూర్తికాగానే RAI కి ఆశ్రయం కల్పించింది. (జనవరి 2003). ఆ సెంటరు స్వతంత్ర సంస్థ అయినప్పటికీ అక్కడ జరిగేవన్నీ హేతువాద హ్యూమనిస్టు



4

కార్యక్రమాలే. వాటినన్నిటినీ భారత-ఆంధ్ర హేతువాద సంఘాలే జరుపుతున్నాయి. అంతగా ఆ సెంటరకూ, ఈ సంఘాలకు తాదాత్మ్యం చేకూరింది. కాగా నిత్యమూ కార్యక్రమాలు జరుపుతున్న ఆ సెంటరుకు భారత హేతువాద సంఘ కార్యాలయాన్ని పంపించడం దాన్ని చంపడమవుతుందా? వెనక్కు తిరిగి ప్రశ్నించుకోండి.

చీరాల, ఇంకొల్లు మధ్య కైవార దూరం 20 కి.మీ. అంటే ఒక గంట ప్రయాణం. ఇంకొల్లు సంఘాన్ని చీరాల నుంచే ఆపరేట్ చేయవచ్చు. పై నగరాల్లో ఒకదరి నుంచి మరోదరికి చేరడానికి మూడు నాలుగు గంటలైనా పట్టవచ్చు. మేధావులూ, సంపన్నులూ కూడినా ఆ నగరాల్లో హేతువాద సంఘాన్ని నిలబెట్టి పెంచలేకపోయారు.

నిజానికి హేతువాద ఉద్యమాలు మతాలూ కావు, మూక ఉద్యమాలు కావు. ఇవి భావ విప్లవోద్యమాలు. సభలు, సమావేశాలు, అధ్యయన శిబిరాలు, పత్రికలు నడుపుకొంటూ, భావ విప్లవ సాహిత్యాన్ని సృష్టిస్తూ, ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడమే వీటి లక్ష్యం. వీటిలో బాధ్యతలుంటాయి కాని పదవులుండవు. వీటిలో పాల్గొన్న మానవుడికి తన బాధ్యత నిర్వహిస్తున్నాన్న తృప్తి వుంటుందికాని, అధికార ధనాదులు లభించవు. స్వచ్ఛంద కార్యకర్తలే వీటినిధి కాని, లక్షల విరాళాలివ్వగల దాతల ఔదార్యం కాదు. అందువల్లనే తక్షణ ఫలితాలాశించే రాజకీయ విప్లవాలనబడే వాటివలె దీర్ఘకాలంలో ఫలితాలను ఆశించి, సాధించగల భావవిప్లవాలు ఈచుకపోవు. పదవులాశించే వారికి వీటిలో ఏ కాణాచీ దొరకదు. కాని, వీటికి వెలుపలవున్న వారు పితూరీలు లేవదీయడం సాగిస్తూనే వుంటారు. అయినా, అవి వీగిపోతుంటాయి.

"ఎవరో ఫారినర్ డబ్బులు యిస్తే, రాడికల్ హ్యూమనిస్టు సెంటరు కట్టి దానిని పాడుపెట్టారనేది మరో అభియోగం." బొంబాయిలోని 5 కోట్ల రూపాయల ఎం.ఎన్.రాయ్ మెమోరియల్ భవనం అతీగతీ లేకుండా పోవడం జ్ఞాపకం వచ్చినందువల్ల ఈ అభియోగం చేయ బుద్ధయిందేమోకాని, ఇంకొల్లులోని రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ సజీవ కేంద్రం. ఓ మంత్రిగారి గోచివూడిందంటే బ్లాకులు కట్టి పెద్దక్షరాలతో రాసే దినపత్రికలు, ప్రదర్శనకు పెట్టే టీవీ ఛానళ్లూ మనకున్నాయి కానీ, ఎంత పెద్ద హేతువాద కార్యక్రమాలు జరిగినా, వాటి గురించి అవి ఒక మూలనైనా చోటివ్వవు. ఇంకొల్లు సెంటర్‌లో యేటా నాలుగైదు పెద్ద కార్యక్రమాలు జరుగుతాయి. ఆ సెంటర్‌లో ప్రతిరోజూ స్వచ్ఛంద కార్యకర్తలు కలుస్తుంటారు. అక్కడ మంచి గ్రంథాలయం వుంది. హేతువాది మాసపత్రిక అక్కడే తయారవుతుంది. నేను ప్రూపు చూశాక సెంటర్ కార్యకర్తలే విజయవాడ వెళ్లి పత్రిక కాపీల అచ్చు పూర్తి చేయించుకొని, ఇంకొల్లు చేరి అడ్రసులు వ్రాసి, చీరాల వచ్చి పోస్టు చేస్తుంటారు. ఈ కృషిలో అక్కడి కార్యకర్తలు ఐదు-పది మంది స్వచ్ఛందంగా పాల్గొంటుంటారు. నా అనారోగ్య కారణాలవల్ల హేతువాది ప్రచురణ తెనాలి హేతువాద మిత్రులు చేపట్టారు. 30 సంచికల ప్రచురణ తరువాత వారికీ చాలిపోతే ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ కార్యకర్తలు ప్రచురణ బాధ్యతను చేపట్టి ప్రత్యేక సంచికలతోపాటు ఇప్పటికి 66 హేతువాది సంచికలు ప్రచురించారు. నా సాహిత్యాన్ని, ఇతర హేమా ప్రచురణల్ని అక్కడి మిత్రులే వెలువరిస్తుంటారు. లోగా వెలువరించినవికాక, నా రచనల్లో 1400 పేజీలు 3 సంపుటాలుగా వారే 2007 ఆగస్టులో వెలువరించారు. అచ్చయిన సాహిత్యమంతా అక్కడ నుంచే వారు పుస్తకాల షాపులకు పంపిణీ

చేస్తారు.

కార్యక్రమమంటే యేమిటో సరయిన అవగాహన లేని వారికి ఇదంతా పాడుపెట్టబడిన సెంటరు కృషే. ఇలాంటి వారికోసమే నేను "మనం ఏమి చేయాలి?" శీర్షికన 1997లో ఒక కార్యక్రమ ప్రణాళికను రచించి పంపిణీ చేశాను.

వయోభారం వల్ల నేను కొన్ని ప్రాంతాల్లో ప్రసగించడానికి వెళ్లలేకపోతున్నాను. సెంటరులోని ఆరితేరిన ఉపన్యాసకులు ఆ కొరతను తీర్చి వివిధ ప్రాంతాల్లో జరిగే సమావేశాలకు, బహిరంగ సభలకు హాజరయి హేతువాద మానవవాద వాణివి నిపిస్తున్నారు. ఇంకొల్లు సెంటర్‌ది కేవలం సంఖ్యా బలమేకాదు. అక్కడ హేతువాద-మానవవాద తాత్విక పోకడల్ని, శాస్త్రీయ దృక్పథాన్ని తగినంతగా అవగాహన చేసుకొన్న స్వచ్ఛంద కార్యకర్తలు చాలమంది వున్నారు. అదే ఆ సెంటరు బలం. కేవలం మూఢ నమ్మకాలను, మతాలను, దేవుళ్లను వ్యతిరకిస్తూ అక్కడి వారు వాదులాడరు. హేతువాద దృక్పథం తొలి దమ్ములోనే వాటిని నిరాకరిస్తుందని వారికి తెలుసు. జ్ఞానం, సత్యం, స్వేచ్ఛ, నైతిక విలువలు ఒక శ్రేణిలో వుండి మానవవాద మార్గాన్ని చూపుతాయనే సమగ్ర శాస్త్రీయ దృక్పథాన్నే వారు హేతువాదంగా భావిస్తారు.

మా గ్రామానికి (నాగండ్లకు) 8 కి.మీ. దూరంలో వున్న ఇంకొల్లు 25,000 జనాభా గల చిన్న బస్తీ. అది మండల కేంద్రం కూడా. 1940 దశకం నుంచీ అక్కడ కమ్యూనిస్టులు, హ్యూమనిస్టులు, నాస్తికులు తగు సంఖ్యలో వుండేవారు. పూర్వాశ్రమంలో కమ్యూనిస్టులుగా వున్న కరిహరిబాబు, షేక్ బాబు గారలు నా పరిచయంతో హేతువాదులుగా మారి ఇంకొల్లులోని వారినేకాక, పరిసర గ్రామాల్లో కూడా చాల మందిని హేతువాదం వైపు మార్చారు. అలా నా రచనలు చదివి మారిన వారిలో చాలమంది విద్యావంతులున్నారు. ఈనాటి భారత హేతువాద సంఘాధ్యక్షుడు కుర్రా హనుమంతరావు, ఆంధ్రప్రదేశ్‌హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి మేడూరి సత్యనారాయణగారలు కూడా వున్నారు. 1940 దశకం నుంచీ రాడికల్ హ్యూమనిస్టు భావాల ప్రభావంలో వున్న రిటైర్డ్ సబ్‌పోస్టుమాస్టర్ రావి సుబ్బారావు వారికి తోడయ్యారు. ఇంకొల్లులో రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ స్థాపనకు రెండుమూడు లక్షల రూపాయిల ఖరీదు చేసే 10 శెంట్ల స్థలాన్ని తన స్వంత ఖర్చులతో సుబ్బారావు రిజిష్టరు చేశాడు. ఆ సెంటర్ పేర జరిగే ప్రతి వార్షిక సభలోను భవన నిర్మాణ ప్రసక్తి వచ్చేదేకాని, వాయిదా పడుతూ వచ్చింది.

ఇంతకు ముందు ఎవరో ఫారినర్ అన్నామే - ఆయన ఎవరో కాదు - ఆరమళ్ల పూర్ణ చంద్రారెడ్డి. కులవాచకాన్ని ఆయనే తొలగించుకున్నాడు. ఆయన విశాఖ ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఉద్యోగంలో వున్నప్పటి నుంచి హేతువాద మానవవాద ఉద్యమాల్లో భాగస్వామి. పూర్ణచంద్ర మంచి రచయిత కూడా. "ఆధునిక విజ్ఞానం ఏమి చెపుతోంది?" అన్న అయన గ్రంథం రెండు ముద్రణలను హేతువాది తీసుకువచ్చింది.

1985 ప్రాంతంలో పూర్ణచంద్ర అమెరికా వెళ్లి ప్రవాసాంధ్రులుగా స్థిరపడ్డారు. అక్కడ నుంచి ఆయన పంపిన 2000 డాలర్లతోనే మేము చీరాలలో హేమా ప్రింటర్స్ యేర్పాటు చేసుకొని, హేతువాదిలోపాటు చాల గ్రంథాలను అచ్చులోకి తెచ్చుకొగలిగాం. నేను అమెరికా వెళ్లినపుడు వారియిల్లే నా విడిది - మకాం.

పూర్ణచంద్రగారి తల్లి సీతారావమ్మ మరణ సందర్భంగా జరిగిన స్మారకసభలో

పాల్గొనడానికి ఇతర మిత్రులతో కలిసి నేను తెనాలి దగ్గరి వలివేరు చేరుకున్నాను. సభానంతరం నేను, పూర్ణ చంద్ర ప్రత్యేకంగా కలసినపుడు ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ పరిస్థితి యెలావుందని వాకబు చేశాడు. అలాగేవుందనీ, వార్షికోత్సవాలు మాత్రం జరుగుతున్నాయి అని చెప్పాను. కాని విరాళం ప్రసక్తి మా మధ్య రానేలేదు.

అనంతరం ఒకనాటి రాత్రి 10-11 గంటల మధ్య నాకు ఫోను చేసి తాను 2 లక్షల రూపాయలు పంపిస్తున్నాననీ, సెంటర్ భవనం మొదలు పెట్టమనీ పూర్ణచంద్ర చెప్పాడు. దానికి మరో రెండు లక్షలు కలిపి సెంటర్ బాధ్యులు లింటల్స్ మట్టం దాక పూర్తిచేశారు. ఆ తరువాత పూర్ణచంద్ర మరల నాకుఫోన్ చేసి భవన నిర్మాణ పరిస్థితి అడిగి, మరో మూడు లక్షలు పంపిస్తున్నాననీ, భవన నిర్మాణం పూర్తి చేయమనీ చెప్పాడు. సెంటర్ బాధ్యులు మరికొంత కలిపి రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ భవన నిర్మాణం పూర్తిచేశారు. మరో ప్రవాసాంధ్రుడు మురకొండ మహీకాంత్ భూరి విరాళ మిచ్చి దాని నిర్వహణకు సహకరించారు.

ఇక కుర్చీలు, బల్లలు, బీరువాలు, ర్యాకులు, ఇతర ఫర్నిచరు, ఫ్యాన్లు, మైకు, కంప్యూటరు, సాఫ్ట్‌వేర్ మొదలైన సరంజామా అంతా స్థానికులు, స్థానికేతరలు విరాళాలుగా యిచ్చినవే. నా స్వంత గ్రంథాలయాన్ని, ప్రచురించిన నా సాహిత్యాన్ని సెంటరుకే యిచ్చాను. మురకొండ ఆర్య తన గ్రంథాలయాన్ని ఇవ్వగా మరికొంతమంది ఉత్తమ సాహిత్యాన్ని కొనడానికి విరాళాలిచ్చారు.

ఇలా వ్రాసుకుంటూ పోతే, మరెంతయినా వ్రాయవచ్చు. నిత్యం ఎవేవో హేతువాద మానవవాద కార్యక్రమాలతో కళకళలాడుతూ వుండే రాడికల్ హ్యూనిస్టు సెంటర్‌ను పాడుబడ్డ దానిగా దెప్పి పొడవడం అవగాహన లేని మేళం. సంఘ కార్యాలయం కోసం బడాబడా నగరాల్లో ఒకటిక్కిని నిర్మించడానికి ఒక్క సెంటు స్థలాన్నయినా సాధించిపెట్టలేనివారు ఇంకొల్లు సెంటర్‌కు వంక పెట్టడం సాహసమే. నిందలు వేయడం తేలికే. అది పెట్టుబడిలేని వ్యాపారం. స్వచ్ఛందంగా బాధ్యతలు నిర్వహించడమే కష్టం. సెంటరుపై దుమారాన్ని ఏ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి?

మళ్లీ మళ్లీ చెపుతున్నా, భారత-ఆంధ్ర హేతువాద సంఘాలు సజీవ సంస్థలు. రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ అనే సజీవ సంస్థ వాటికి ఆశ్రయమివ్వడమే కాక, వాటితో కలిసిపోయింది. వాటి ప్రధాన కార్యక్రమాలన్నిటిలోను ముందు నిలుస్తుంది. ఉద్యమ స్వభావాన్ని అర్థం చేసుకోలేని వారు ఈ సంఘాలకు బరువు చేటు. అలాంటివారు సంఘాన్ని విడిచి వెళ్లిపోతుంటే, వాటికి రెట్టింపు సంఖ్యలో అవగాహన చేసుకున్నవారు సంఘానికి దగ్గరవతారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంలో వున్నవారిలో ముప్పాతిక మూడు పాళ్లు కొత్తవారే. ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటర్‌లోని వారంతా కొత్తవారే. పండుటాకులు రాలిపోతుంటే కొత్త ఆకులు చిగురు తొడుగుతుంటాయి.

(ఇందులో RAI = భారత హేతువాద సంఘం RAI = భారతీయ హేతువాద సంఘం IHEU = అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం R.H. = రాడికల్ హ్యూమనిస్టు)

# ఔనా! వేదంలో అన్నీ ఉన్నాయా? -7

- రావిపూడి

రుగ్వేదం ఆరంభంలో ప్రధమ సూక్తం అగ్నిస్తోత్రం చేసింది. అంతకు మించి ఆ తొమ్మిది మంత్రాల్లో విశేషమేమీ లేదు. అగ్ని అంటే యేమిటో పరమాణు విజ్ఞాన సాంకేతిక పదావళిలో అగ్నిని ఏమంటారో, ఏమనాలో శాఖమూరి వారు చెప్పలేదు. అవసరమని పించలేదో,యేమో

ఆ తరువాతి 22 సూక్తాల్లో ఎన్ని మంత్రాల్లో ఎంతమంది దేవతలను సోమపానానికి అధ్వర్యులాహ్వానించారో తెలుసుకొంటే, ఇంద్రుడొక్కడే సోమపాన ప్రియుడుకాదని అర్ధమవుతుంది.

వృతృణ్ని చంపిన ఇంద్రాను సోమపానానికి రమ్మని అతని ప్రస్తావన తెచ్చిన మంత్రాల్నో ధ్వనించాయి. కాగా, 2 మొదలు 22 వరకున్న సూక్తాల్లో ఇంద్రుణ్ని 22 మంత్రాల్లో సోమపానానికి రమ్మని అధ్వర్యులు ఆహ్వానించారు.

ఇంద్రుడంటే విద్యుత్ బలమనీ, సోమం అంటే విద్యుదావేశమనీ పరమణు విజ్ఞాన గ్రంధరచయితులు పేర్కొన్నారు. విద్యుత్‌బలానికి విద్యుదావేశం అవసరమనే దాన్ని ఎలాగోఒకలాగు సరిపెట్టుకోవచ్చు. కాని, ఆ 22 సూక్తాల్లోనే అగ్నిని 10 మంత్రాల్లో, **వాయువును** 6 మంత్రాల్లో, **అశ్వినుల్ని** 4 మంత్రాల్లో, **మరుత్తుల్ని** 3 మంత్రాల్లో, **రుభువుల్నీ, త్వష్టనీ, దేవతల భార్యల్నీ** రెండేసి మంత్రంలో **విశ్వ దేవతల్నీ మిత్రా వరుణుల్నీ, బృహస్పతినీ** ఒక్కొక్క మంత్రాల్లో సోమాపానానికి రమ్మని అధ్వర్యులాహ్వానించడమే అగమ్యంగా వుంది.

అశ్వినులకు (అయస్కాంత ధ్రువాలకు), మిత్ర-వరుణులకు (ఎలక్ట్రాను, ప్రోటానులకు)సోమపానం (విద్యుదావేశాన్ని త్రాగడం) అవసరమా? మరి, అగ్ని వాయువు, మరమత్తులు, రుభువులు, త్వష్ట దేవతల భార్యలు, విశ్వదేవతలు, బ్రాహ్మణస్పతులకు సోమపానం (విద్యుదావేశం) ఎలా అవసరమై, అందుకు వారు ఆహ్వానించబడ్డారు? గుర్రాలు జూలు విదిలించుకున్నట్లు దులబరించుకుంటే చాలదు. ఈ ప్రశ్నకు సమాధానం కావాలి. వారిని అధ్వర్యులు కేవలం సోమాపానానికి ఆహ్వానించి తామే త్రాగేవారని అంటే అర్థముంటుందికాని, విద్యుదావేశాన్ని యెక్కించడానికి పదే పదే పిలిచారంటే, ఏమని అర్థం చేసుకోవాలి? దేవతల భార్యలకు కూడా విద్యువావేశం ఎక్కించాలా?

అంతేకాదు, విద్యుదావేశాన్ని యెక్కించడం కోసం ప్రొటాన్, ఎలక్ట్రాన్లను ఆహ్వానించడమేమిటి? అదేనా పరమాణు విజ్ఞానం? విద్యుత్తు అనేది ఎలక్ట్రాన్లు ప్రవాహమే. దానికి విద్యుదావేశాన్ని ఎవరు ఎక్కడ నుంచి యెక్కిస్తారు? ప్రొటానుకు విద్యుదావేశాన్ని త్రాగించడమనేది పరమాణు విజ్ఞాన శాస్త్రీయాంశమా? అయినా, ఆయా దేవతలకు విద్యుదావేశాన్ని త్రాగించమని స్తోత్రాలపై స్తోత్రాలు చేయడం విజ్ఞాన శాస్త్రీయమా? అసలు స్తోత్రాలనేవి విజ్ఞాన శాస్త్రంలో భాగాలా? కేవలం 22 సూక్తాలో 22 సార్లు సోమపానం కోసం ఇంద్రుణ్ని పిలవడంలోని పరమాణు శాస్త్ర విజ్ఞానమేమిటి? మంత్రాల వల్లింపుతో తోముడు మొదలు పెట్టి చెప్పిందే చెప్పడంలో అధ్వర్యులు సాధించింది శాస్త్ర విజ్ఞానంకాదు. వారి సోమాపాన

దావాగ్నిలో విజ్ఞానాన్ని వెదకబూనడం విజ్ఞానుల పనికాదు.

ఉదాహరణకు రు. 1-16వ సూక్తంలోని కొన్ని వరస మంత్రాలను పరిశీలించండి:

3. ఇంద్రం ప్రాతర్హ వామహ ఇంద్రం ప్రయత్వధవరే ఇంద్రం సోమస్య పీతవే॥

4. ఉపన: సుతమాగహి హరిభిరింద్ర కేశిభి: సుతే హిత్వా హవామహే॥

5. సేమంన: స్తోమమాగ హ్యూపేదం సవనం సుతం గౌరోన తృషిత: పిబ॥

6. ఇమే సొమాస ఇంద వయస్సుతోసో అధి బర్హిహితా ఇంద్ర సహసీ పిబ॥

7. అయంతే స్తోమే అగ్రియోహృది స్పృగస్తు శంతమః

అథా సోమం సుతం పిబ॥

8. విశ్వమిత్సవనం సుతమింద్రో మదాయగచ్ఛతి వృత్రహా సోమ పీతమే॥

కావూరు వినయాశ్రం వారి 'ఆంధ్రవేదములు' పై మంత్రాల దండాన్వయసారాన్ని ఇలా యిచ్చింది: టిడిపి వారి వేద సంహిత కూడా ఇదే అర్థాన్నిచ్చింది.

3. సోమపానానికి ఇంద్రుణ్ని పిలుస్తున్నాం.

4. ఇంద్రా, సోమం నిమిత్తం నీవు **బొచ్చు గుర్రాలతో** రా.

5. దప్పికగొన్న ఆవువలె నీవీ సోమాన్ని త్రాగు

6. **దర్భల మీద అభిషవించిన** ఈ సోమాన్ని బలం కోసం త్రాగు

7. అభిషవించిన సోమాన్ని సవానంతరం త్రాగు

8. మదం కోసం ఇంద్రుడు సోమపానం చేయబోతున్నాడు.

ఇంద్రుణ్ని బొచ్చుగుర్రాలతో రమ్మంటే అర్థమేమిటి? విద్యుత్ బలాన్ని బొచ్చు క్వార్కుకణాలతో రమ్మనా అర్థం? ఇందులోని పరమార్థమేమిటి? విద్యుదావేశాన్ని దర్భల మీద అభిషవించడమేమిటి?

అయినా, విద్యుత్ బలం (ఇంద్రుడు) విద్యుదావేశాన్ని (సోమాన్ని) త్రాగిందనడానికి ఇన్ని మంత్రాలెందుకు? విద్యుత్ బలం విద్యుదావేశాన్ని త్రాగుతుందా? ఆ మాట చెప్పడానికి ఇన్ని మంత్రాలెందుకు? పరమ పురుషుడు అలా చెప్పిందే చెప్పినప్పుడు తప్ప, ఆ మంత్రాలు వేదర్షులకు నోటికి రాలేదా? ఆ వారసత్వమే వేదర్షులకు, వారి శిష్యులకు అబ్బి ఇప్పటికీ అర్థాలు తెలియక వూరికే రుబ్బి వల్లిస్తున్నారా? పాడిందే పాడరా, పాచిపళ్లదాసరీ అనే నానుడి ఈ వల్లింపులోనే పుట్టిందా?

వేదమంతటా పరమాణు విజ్ఞానాన్నే దర్శిస్తున్న శాఖమూరివారు వసిష్ఠ అంటే పరమాణు కేంద్రక (Nucleus) మనీ, అగస్త్య అంటే కేంద్రక బల (Nuclear force) మనీ మనల్ని గ్రహించమంటున్నారు. పరమాణు విజ్ఞానంలో దోపడానికి, పాపం, వారికి ఈ యిద్దరు రుషులే దొరికారు కాని, ఇతర రుషులెవ్వరి జోలికీ వారు తమ గ్రంథంలో పోలేదు.

వసిష్ఠకు పరమాణు కేంద్రకమని అర్థం తీయడానికి వారు రుగ్వేదం 7వ మండలంలోని 33వ సూక్తాన్ని ఉదహరించారు. నిజానికి ఆ సూక్తానికి అర్థంతీత రామునితోక పివరుండిట్లనియే

అనేదానికి అన్వయం చెప్పే దాన్ని పోలివుంది. అది వ్యంగ్యం. చిలకమర్తివారు కూడా అలాంటి వ్యంగ్యంతోనే తులసీ దళాలతో శ్రీరఘురామచారు కాయించారు. (శ్రీ రఘు రామచారు తులసీదళ దామ-గణపతినవల)

టి.టి.డి. వారి రుగ్వేగ సంహిత ప్రకారం 7వ మండలంలోని మొత్తం 104 సూక్తాలూ వసిష్ట (రుషి) చెప్పినవే. ఆ సూక్తాల్లోని మంత్రాలు మొత్తం 852. అంటే పరమాణు కేంద్రకమే ఆ 852 మంత్రాల ద్రష్టగా మనం గ్రహించాలని పరమాణు విజ్ఞాన గ్రంథకర్తల ఆదేశం. అయినా, పరమాణు కేంద్రకం మంత్రాలు వల్లించడమేమిటండీ? ఇంతకంటె పెద్దజోక్ యేముంటుంది?

వసిష్ట అంటే పరమాణు కేంద్రకమైతే ఆ కేంద్రకం మంత్రాల్లో విశ్వదేవులు, అహి,అహిబుధ్య, భాగుఉష, దధికర, సవితృ, రుద్ర, జలం, రిభువులు, మిత్రావరుణులు, అగ్ని నదులు, ఆదిత్యులు, అంతరిక్షం, పృధ్వి, వాస్తోష్పతి, ఇంద్ర, మరుత్తులు, రుద్ర, వాయువు, సరస్వతి, బృహస్పతి, విష్ణు, పర్జన్య, కప్పలు, దేవతలు మొదలైన వారి ప్రస్తావన తెచ్చి, వారిని స్తుతించడమేమిటి? ఎందుకు? వీటన్నిటికీ, పరమాణు కేంద్రానికీ మధ్య ఏమిటి సంబంధం?

రోగాలను చంపి తన గృహాన్ని సుఖశాంతులతో బ్రతుకనీయమని వాస్తోష్పత్తిని పరమాణు కేంద్రం వేడుకోవడమేమిటి? (రు. 7-54,55) వాస్తు శాస్త్ర మనబడేదాని ఉత్పత్తి కూడా వేదంలోనే జరిగిందా? అంటే వాస్తు పూజ పరమాణు కేంద్రకమే ప్రారంభించిందా?

7-54-(1) వాస్తోష్పతే ప్రతి జానీహ్యస్మాన్ త్స్వావేశో అనమీవో భవానః షయత్ త్వేమహే
ప్రతి తన్నో జుషస్వశంనో భవద్విపదేశం చతుష్పదే।
2) వాస్తోష్పతే ప్రతరణో న వది గయస్ఫానో గోభిరశ్వే భిరిన్దో।
అజరాసస్తే సఖ్యే స్యామపితే పుత్రాన్ ప్రతి నోజుషస్వ॥
3) వాస్తోష్పతే శగ్మయా సంసదా తే సక్షీమహి రణ్యయా గాతుమత్యా।
పాహిక్షేమ ఉత యోగే వరం నో యూయం పాత స్వస్తిభిః సదా న॥
7-55-(4) అమీవహా వాస్తోష్పతే విశ్వా రూపాణ్యావిశన్ సఖా సుశేవ ఏధినః॥

భావంః (1) వాస్తోష్పతీ, మా గృహాన్ని రోగాలురానిదిగా, మా జనాన్ని, పశువుల్ని సుఖంగా వుండేట్లుగా చేయి (2) మమ్మలీ, మా ధనాన్నీ వృద్ధి పొందించి, మమ్మల్ని ముసలితనానికి దూరం చేయి (3) మాకు ధనాన్ని, కల్యాణాన్ని ఇవ్వు (4) మా రోగాలను నశింపజేసి సుఖాన్ని చేకూర్చు.

వాన కురుస్తుందోచ్, రారండోయ్ కప్పల్లారా అని 7-103 సూక్తం 11 మంత్రాల్లో పరమాణు కేంద్రకం (వసిష్ట) కప్పల్నీ ఆహ్వానించడమేమిటి? ఆస్తవాల పరమార్థమేమిటి? వేదంలో అదివుంది, ఇదివుంది అని వూరికే లొట్టలు వేస్తే ప్రయోజనంలేదు. ఏమివుందో ఆయారుషుల, దేవతల పేర్లతో అల్లబడిన సూక్తాల మొత్తం అర్థాన్ని సమన్వయం చేసి చూపాలి. అయినా, పరమాణు కేంద్రకం కప్పల్ని పిలవడం ఏమిచోద్యమండీ.



10

ఇక టిటిడివారి ఆర్షవిజ్ఞాన సర్వస్వం ఈ వసిష్టను గురించి ఏమి చెపుతుందో చూద్దాం:

వసిస్టుడనే పేరుతో ఇతడు మూడు జన్మలెత్తాడుట, బ్రహ్మమనస్సు నుండి మొదటిసారి, బ్రహ్మహోమాగ్ని నుంచి రెండోసారి, మిత్రా వరుణుల నుంచి మూడోసారి పుట్టాడట. ఆ మూడు జన్మలలోనూ అరుంధతి అతని పెండ్లామట! కాని, యముడల్లిన తెరచాటున ఊర్వశికి వసిష్టుడు జన్మించాడని రు. 7-33-11, 12, 13 మంత్రాలవల్ల తెలుస్తుంది.

అయితే, వసిష్టుడనే పేరు ఎలా వచ్చిందంటే, అణిమాది సిద్ధులచేత వసువుల్ని (పంచభూతాలను) వశపరచుకోవడం వల్ల అతనికా పేరు వచ్చిందట. (ఆ.వి.స.పే.28)

శాఖమూరి వారు వషిష్ట వ్యుత్పత్తి అర్థాన్ని మరో తరహాగా యిచ్చారు. వస్ అంటే నివసించుట అనే అర్థమనీ, వసిష్ట అంటే నివసించు ప్రదేశమనీ, కనుక వసిష్టను పదార్థ కణాలుండే పదార్థంగా గ్రహించాలనీ అన్నారు. వసిష్టులు తనకు దూరంగా పోలేరని ఇంద్రుడన్నాడనీ, ఇంద్రుడంటే విద్యుత్ బలం కాబట్టి, వసిష్టులు విద్యుదావేశం కలిగివుండటాన్ని రుజువు చేస్తున్నదనీ, వసిష్టులు జుట్టు కుడివైపుకు వేయడాన్ని కణాల ప్రదక్షిణను తెలుపుతున్నదన్నారు. ఈ అన్వయం కోసం ఎంత చాకిరి చేశారండీ వారు. విశ్వశాస్త్రం గురించి ప్రారంభించినవారు కుడి యెడమల ప్రస్తావన తేవడంలోనే సంకుచిత మనస్తత్వం వెల్లడవుతుంది.

వ్యాకోచ సంకోచ శక్తులున్నది విశ్వానికి కాదు. ఇలాంటి అన్వయకర్తలకే అది వుంది. ఇదంతా శ్రీ రఘురామచారు లాంటిదే.

పరమాణు కేంద్రకం (Nucleus) మంత్రాలు వల్లించడమనేది ఎంత బూటకమో ఇంతకు ముందే చూచాం. ఏ నోటితో పరమాణు కేంద్రకం ఆ 856 మంత్రాలను వల్లించిందో, లేక ఏ ధీబలంతో వాటిని దర్శించిందో

పైగా ఈ వసిష్టుడు ఊర్వశి మనస్సు నుంచి పుట్టాడని 11వ మంత్రం చెపుతుంది. ఊర్వశిని చూచిన మిత్రా వరుణుల మనస్సు చలించి వారికి రేతస్సు పతనమైందట. దాని నుంచి పుట్టిన వసిష్టుణ్ని దేవతలు పద్మంలో వుంచారుట. 12వ మంత్రం ఆయన తెరచాటున పుట్టాడంటుంది. అలాగే, మిత్రా వరుణులు కుండలో వీర్యం కారిస్తే ఆ కుండ నుంచి అగస్త్యుడు పుట్టాడని 13వ మంత్రమంటుంది. అయితే ఈ మంత్రాలు చెప్పిందెవరయా అంటే వసిస్టుడే. నయా వేద విద్వాంసుల ప్రకారం పరమాణు కేంద్రకమే.

ఇక అగస్త్యరుషి సంగతి చూద్దాం. రుగ్వేదం ప్రథమ మండలంలో 191 సూక్తాలుంటే అందులో 24 సూక్తాలు అల్లినవాడు అగస్త్యుడే. పరమాణు విజ్ఞాన గ్రంథకర్తల ప్రకారం అగస్త్య అంటే కేంద్రబలమట (Nuclear force) . ఆ కేంద్రబలం కూడా మంత్రాలల్లి స్తోత్రాలు చేస్తుందన్నమాట! ఆ 237 మంత్రాల్లో స్తుతించబడిన దేవతలు ఇంద్ర, మరుమత్తులు, అశ్వినులు, అంతరిక్షం, పృథ్వి, విశ్వదేవులు, అన్నం, అప్రిస్, అగ్ని, బృహస్పతి, జలం, గడ్డి, సూర్య మొదలైన వారు. పరమాణు కేంద్రకం (వసిష్ట) అల్లిన మంత్రాల్లో కనిపించినంతమంది



11

దేవతలు కేంద్రక బలం (అగస్త్యం) అల్లిన సూక్తాల్లో కనిపించకపోవడానికి కారణమేమిటో మనకు తెలియదు. పైగా శాఖమూరివారు 104 వసిష్ట సూక్తాల్లో ఒక్కదానినైనా (7-33) తన గ్రంధంతో యిరికించారు కాని, అగస్త్య సూక్తాల్లో ఒక్క సూక్తాన్నయినా ఉదహరించలేదు.

వసిష్టలో ఉదహరించిన 7-11 మంత్రం ఓ వసిష్టా అని సంబోధిస్తున్నది. వసిష్ట (పరమాణు కేంద్రకం) తనను తానే మంత్రంలో సంబోధించుకోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? అయినా పరమాణు కేంద్రకాలు, బలాలు మంత్రాలు చదవడమేమిటండి?

అందువల్ల, వసిష్ట, అగస్త్య రుషుల పేర్లతో వున్న సూక్తాల్లోని వందలాది మంత్రాల్లోని పరమాణు విజ్ఞాన సిద్ధాంతాన్ని అతుకులు లేకుండా కలిపి, ఆ ఆధునిక విజ్ఞానాన్ని విద్యార్థులకు బోధించి, తమ కుతి తీర్చుకోవలసిందిగా బాధ్యులను కోరడంలో తప్పు లేదనుకుంటాను.

తమాషాయేమంటే, పరమాణు విజ్ఞానం గ్రంథంలో మహంజోదారో ముద్ర (M 1186) బొమ్మ ప్రచురించారు. అందులో క్రిందవున్నవారు సప్తర్షులట. పైన కుండను పట్టుకున్నవాడు అగస్త్యుడున్నూ, కుండలోపల వున్నవాడు వసిష్టుడూనట! కాన, వసిష్టుడు. కుంభసంభవుడన్న వాదాన్ని రుగ్వేదం 7-33-10వ మంత్రం సూచిస్తుందన్నారు. ఊర్వశి దేవవేశ్యకదా, ఆమెను చూడగానే మిత్రా వరుణుల వీర్యం కుండలో కారగా ఆ కుండ నుంచి వసిష్టుడు పుట్టాడు కాన వసిష్టుణ్ని కుంభ సంభవుడన్నారు. ఆ మిత్ర వరుణులే ఊర్వశిని చూచి కుండలో కార్చిన వీర్యం నుంచి అగస్త్యుడు పుట్టాడని వేద, పూరాణాలు చెపుతున్నాయి. కుండల్లో కార్చిన వీర్యం మనుషులు కావడమేమిటి? వాళ్లంతా కుంతి సంతానం వంటివారేనా; అయినా, మిత్రా వరుణులు ఊర్వశితో కలిస్తే, వసిష్ట, అగస్త్యులు పుట్టారంటే సరిపోయేదానికి ఇంతటి జుగుప్సాకరమైన భాషలో ఆ సంఘటనల్ని వర్ణించాలా? ఊర్వశి అనేది పరమాణువులోని విద్యుత్ క్షేత్రమనీ, వసిష్ట అనేది పరమాణు కేంద్రమనీ, అగస్త్య అనేది కేంద్రక బలమనీ వేదమంత్రాలకు అనువాదం చెప్పేవారు ఆ మాటల్ని వేదాదులు బూతు పరంగానే ఎందుకు వాడారనే దాన్ని ఎన్నడయినా ఆలోచించారా? దేవుళ్ల పేర్లతో, రుషుల పేర్లతో బూతులు కూయడం దైవదూషణ క్రింద చేరదా? త్రాగుబోతులైన వేదర్షులు మరో భాషరాక, బూతుపదాలు ప్రయోగించారా? లేకపోతే రంభోర్వశీ మేనకాదులను చూస్తేనే బ్రాహ్మాదులకు, రుష్యాదులకు బట్టలు తడవడం, కుండలు నిండడం, నేల బురదకావడం ఏమిటండీ? ఈ చండాలమంతా పరమాణు విజ్ఞానమేనా? ఇదంతా చూస్తుంటే వేద రుషులంతా పాశవిక కామపీడితులనీ, దాన్ని వారు దేవతలకు ఆపాదించారనీ తేలడంలేదా?

కాగా, సింధూ నాగరికతను కించపరచేవారు మహెంజోదారో ముద్రలను రుషుల పరంగా అన్వయపరచే సాహసం చేయడం వింత. ఆర్యనాగరికత సింధూలోయల్లో వర్ధిల్లిందా? సింధూనాగరికత ముద్రల్ని ఆర్యర్షుల పుట్టుకకు ఉదాహరణలుగా చూపడమెందుకు? ఆర్యులకు మంత్రాలుండగా ఇంకా ముద్రలెందుకు? ఇది చౌర్యం కాదుటండీ?

అగస్త్య అంటే స్థిరమైనదని వ్యుత్పత్తి అర్థం కాబట్టి, వసిష్ట అంటే కేంద్రకం కాబట్టి ఆ



12

కేంద్రకాన్ని పుట్టించే కేంద్రక బలాన్నే (Nuclear force) వసిష్ట అన్నారని పరమాణు వైజ్ఞానికుల అర్థంతీత. ఐతే ఇక సప్తర్షుల బొమ్మలతో, కుండలతో మహెంజోదారో ముద్రలెందుకు వేసినట్లు?

"ఋగ్వేదమందలి రెండవ మండలం నుండి ఎనిమిదవ మండలం వరకు కుటుంబ మండలములుగా పేర్కొనబడినవి. ఎందుకనగా అందు ఒక్కొక్క మండలం ఒక్కొక్కరుషి, ఆయన కుటుంబ సభ్యులచే రచించబడినది. వీరు సప్తర్షులుగా ప్రసిద్ధులు" అంటున్నారు మళ్లీ శాఖమూరి వారు. ఇంతకూ ఆయా మండలాల మంత్రాలు రుషులు రచించినట్లా, లేక పరమాణు కణాలు రచించినట్లా? ఏడవ మండలమంతా వసిష్టుడు రచించినట్లా, లేక పరమాణు కేంద్రకం రచించినట్లా?

వారీ వసిష్టుని వృత్తాంతాలకు శ్రీ మద్భాగతాన్ని ఉదహరించారు. కల్మాషపాదుడికి బిడ్డలు లేకపోతే, "తదనుమతి ఆ వసిష్టుడు మదయంతికి కడుపు చేసె మదన క్రీడన్" అంటుంది ఆ భాగవతమే. దీని భావమేమిటండీ? వసిష్టుడంటే పరమాణు కేంద్రకమైతే, మదన క్రీడతో (..............) స్త్రీలకు గర్భం చేసి పిల్లల్ని పుట్టించడం కూడా పరమాణు కేంద్రకాలు చేస్తాయా?

ఇదేనాండీ, పరమాణు విజ్ఞానం? అలాంటి అజ్ఞాన స్థాయికి ఏయే ఔషధాలు వాడితే అది ఉపశమిస్తుంది? (ఇంకా వుంది)

# "ఆత్మ"?

-మేడూరి సత్యనారాయణ

ఆదిమానవుడికి మతం లేదు. ప్రాచీన మానవుడు మతాన్ని సృష్టించుకుని దాని వలలో చిక్కుకున్నాడు. సాలెపురుగు తన ఆహార సంపాదనకోసం తయారు చేసుకొన్న తన గూటిలోనే చిక్కుకుని పోయినట్టుగా ప్రాచీన మానవుడు తన భావజాలంలో బంధీ అయ్యాడు. ఆదిమానవుడు మతంలేని జంతు వారసత్వంగా పరిణామ క్రమంలో ఉన్నత స్థాయి ఆలోచన చేయగల, విచక్షించగల, సంకల్పించగల మెదడును తన ప్రత్యేక లక్షణంగా ఆవిర్భవించాడు. ఉన్నత స్థాయి సామర్థ్యం గల మెదడునైతే వారసత్వంగా పొందాడు కాని ఆదిమానవుడుకి ప్రకృతి జ్ఞానం చాలా తక్కువ. అయితే, ఏమిటి? ఎలా? ఎందుకు? లాంటి ప్రశ్నలను నిర్విరామంగా సంధించగల సామర్థ్యం అతనికి వుంది. అందువల్లనే ప్రకృతిలో ఉన్న కార్యకారణ సంబంధాన్ని గుర్తించి ప్రతి సంఘటనకు కారణాన్ని అన్వేషించాడు. ఆ క్రమంలో తనకు తెలియని సంఘటనకు భౌతికేతర కారణాన్ని ఊహించాడు. వాని ఆధారంగా మరిన్ని ఉప ఊహలు చేయడంవల్ల మతాన్ని సృష్టించుకున్నాడు. సృష్టిలయ వినాశ కర్తగా దేవుడిని ప్రతిష్టించు కున్నాడు. విశ్వాస ఊబిలో కూరుకుపోయాడు.

ఆలోచించగల హోమో సెపియన్స్ మానవుడికి పూర్వమే ఆవిర్భవించిన హోమో ఎరక్టస్ మానవుడే ప్రకృతిని అవగాహన చేసుకోవడం ప్రారంభించాడు. తన బలహీన శరీరానికి సహాయంగా పరికరాలను తయారుచేసి ఉపయోగించడం మొదలు పెట్టాడు. పరిశోధకులు సాక్ష్యాలతో ఈ విషయాన్ని నిర్ధారించారు.

అన్ని మతాలు 'ఆత్మ' చుట్టూ తిరుగుతూ వ్యవస్థీకృతమైనాయి. భౌతికేతర 'ఆత్మ' ఉన్నదనే విశ్వాసంతోనే చనిపోయిన మనిషి తిరిగి లేచాడని, అంతా అలాగే లేస్తారని బైబిలు తన విశ్వాసుల్ని నమ్మించింది.

"గొంగళిపురుగు ఒక ఆకును వదలి మరొక ఆకు మీదకు ప్రాకినట్లు జీవాత్మ ఒక దేహాన్ని వదలి మరొక దేహంలో దూరుతుందని"ని బృహదారణ్యకోపనిషత్తు చెప్పింది ఈ విశ్వాసం వల్లనే.

"మంచి కర్మలు చేసేవారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలలోను, చెడు కర్మలు చేసేవారు పందులు, కుక్కలు, చండాలురుగా పునర్జన్మ ఎత్తుతార"ని చాందోగ్యోపనిషత్తు ఘోషించడానికి కూడా ఈ విశ్వాస ఆత్మ కారణం.

'ఆత్మ గాలిలాగా, ఆకాశంలాగా, విద్యుత్తులాగా, ఉరుముల్లాగా అశరీరమైంద"ని సారూప్యత లేని పోలికలతో చెప్పింది చాందోగ్యోపనిషత్తు.

'ఆత్మ బొటన వ్రేలంత" వుంటుందని ఒకరంటే 'అణువు కంటే చిన్నది భూమి కంటే పెద్దద"ని మరొకరు అన్నారు.

జీవాత్మ పరమాత్మలో లీనం కావడమే మానవుడి జన్మ పరంపరనుండి విముక్తిగా విశ్వసించారు.

వ్యాసుడు తాను రచించిన మాహాభారతంలో శ్రీకృష్ణుడు అర్జునుడుకు చెప్పినట్టుగా

తన భావాలను చెప్పించాడు. ఆత్మను గురించిన వ్యాసుని భావాలను పరిశీలిస్తే ప్రాచీనులు ఎలాంటి విశ్వాసాన్ని కలిగి వున్నారో మనకు తెలుస్తుంది.

"జీవాత్మకు ఈ దేహమందు కౌమారము, యౌవనము, వార్ధక్యం ఉన్నట్టే మరియొక దేహ ప్రాప్తియు కలుగును"

"ఈ శరీరములన్నియును నశించునవే. కాని జీవాత్మ నాశరహితము, అనిర్వచనీయము, నిత్యము"

'ఆత్మ ఎవ్వరనీ చంపదు. ఎవ్వరి చేతను, చంపబడదు"

"ఆత్మ ఏకాలమనందును పుట్టదు, గిట్టదు. ఇది భావ వికారములు లేనిది. ఇది అజన్మ, నిత్యము, శాశ్వతము, పురాతనము. శరీరము చంపబడినను ఇది చావదు"

'ఆత్మ నాశరహితము, నిత్యము, జనన మరణములు లేని మార్పులేనిది"

"ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని దహింప జాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఆరిపోవునట్లు చేయజాలదు"

"ఆత్మ నిత్యము, సర్వవ్యాపి, చలింపనిది, స్థాణువు, సనాతనము"

"ఆత్మ ఇంద్రియ గోచరము కానిది. మనస్సుకు అందనిది. వికారములు లేనిది".

"పుట్టినవానికి మరణము తప్పదు. మరణించిన వానికి పునర్జన్మ తప్పదు"

"ప్రతి దేహమునందు ఉండెడి ఈ ఆత్మ వధించుటకు వీలుకానిది."

వ్యాస మహర్షి భావాలను పరిశీలిస్తే ఆయన భావాలు ప్రాచీన మానవుల సగటు భావాలుగా మనం అర్ధం చేసుకోవచ్చు.

తరతరాలుగా మానవుడు అర్జిస్తూ వచ్చిన జ్ఞానం సైన్సుగా అవిర్భవించి ఆధునిక విజ్ఞానంగా మన చెంతకు వచ్చింది. ఆదిమానవుడు ప్రకృతి అవగాహన చేసుకున్న తీరుకు కొనసాగింపుగానే విశ్వాన్వేషణ చేసి ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని రూపొందించుకున్నాడు ఆధునిక మానవుడు.

భౌతిక విశ్వం 92 ప్రధాన మూలక పరమాణువులతో నిండి వుందని, వాటి సంయోగ వియోగాల వల్ల లక్షలాది రసాయన, జీవరసాయన పదార్థాలు ఉత్పత్తి అయ్యామని మనకు ఈనాడు రుజువైంది. భౌతిక పదార్ధ నిత్య పరిణామంలో నూతన పదార్థాలు నూతన లక్షణాలతో ఆవిర్భవిస్తాయనీ రుజువైంది. భౌతిక పదార్ధ పరిణామంలో భాగంగానే జీవలక్షణాలను వ్యక్తీకరించగల ప్రాథమిక జీవం ఉత్పత్తి అవ్వగలదని స్టాన్లీ మిల్లర్ ప్రయోగంతో రుజువైంది. జీవంగూడా భౌతిక పదార్ధ పరిణామంలాగే పరిణామం చెందుతూ లక్షలాది జీవజాతులు అవిర్భవించాయని చార్లెస్ డార్విన్ పరిశోధనలతో మనకు రుజువైంది. అంతమంగా కోతి లాంటి పూర్వ జీవినుండి క్రమ క్రమంగా కోతులు, చింపాంజీలు, మానవులు వేర్వేరు జీవపరిణామ దశల్లో ఆవిర్భవించాయని శిలాజ సాక్ష్యాధారాలు మనకు రుజువులు చూపుతున్నాయి. ఆస్ట్రలో పిథికస్ గా ఆవిర్భవించిన మానవపూర్వజీవి హోమో ఎరక్టస్‌గా నిలబడి నడచి అంతిమంగా హోమో సెపియన్స్ గా పరిణామం చెంది ఆలోచించగల ఆధునిక మానవుడిగా ఆవిర్భవించాడని శిలాజ ఆధారాలు, జన్యు చారిత్రక పటాలు తెలియపరుస్తున్నాయి.



15

మానవుడికి మిగతా క్షీరద జంతువులకు ప్రధానమైన తేడా అతని మెదడు నిర్మాణంలో, క్రియాశీలతలో వుంది. ఏనుగులకు తొండం పెరిగిన తీరులోనే మానవుడికి మెదడు పెరిగింది. మరి ఏ ఇతర జంతువుల్లో లేని విధంగా ఆలోచించడానికి, భావ వ్యక్తీకరణకు, విచక్షించడానికి, సమీక్షించడానికి, ఊహించడానికి ఉపకరించే రెండు అర్ధ గోళాలు విపరీతంగా అభివృద్ధి చెందాయి. వాటికి అనుబంధంగా వున్న మెదడులోని ఇతర భాగాలు, కేంద్రాలు మార్పు చేర్పులకు లోనై అంతిమంగా శక్తివంతమైన నిర్ణయాత్మకమైన మెదడు పరిణమించింది. 1400 గ్రాముల బరువుండే మెదడులో ఈ మస్తిష్క అర్ధగోళాలే కుడి ఎడమల వుంటూ దాదాపు 800 గ్రాములు బరువుంటాయి. అంటే మానవుడిని మానవుడిగా రూపు దిద్దడానికి కారణమైన ప్రధాన భాగాలు ఇవేనని గుర్తించాలి.

మానవ మెదడులో 100 కోట్లకు పైగా నాడీ కణాలు (న్యూరాన్లు) బంధిత వ్యవస్థగా పనిచేస్తాయి. ప్రతి నాడీ కణం తన చుట్టూ వున్న 200 నాడీ కణాలతో నాడీ తంత్రుల ద్వారా సంబంధాన్ని కలిగివుండే అవకాశముంటుంది. మెదడులోని వివిధ భాగాలు, కేంద్రాలు దాదాపు 50కి పైగా వుంటాయి. ఇవి 40కి పైగా నాడీ రసాయన పదార్ధాలను (న్యూరోట్రాన్స్మిట్టర్లు) ఉత్పత్తి చేస్తుంటాయి. వీటి ఉత్పత్తిని బట్టి హెచ్చు తగ్గులను బట్టి మెదడు పనితనం ప్రభావితమౌతుంటుంది. ఇవే మనల్ని నిద్రపుచ్చుతుంటాయి. నిద్రలేమిని కలుగచేస్తుంటాయి. మనో వికార వైకల్యాలను కలిగిస్తుంటాయి. ఉద్రేక ఉద్వేగాలను ప్రభావితం చేస్తుంటాయి. సక్రమాలోచనను ప్రేరేపిస్తుంటాయి. ప్రశాంతలను చేకూరుస్తాయి. మానసిక కల్లోలాలను రేపులాలను రేపుతుంటాయి. సంకల్ప సామర్ధ్యాలను కల్గిస్తుంటాయి, దేహ ప్రభావం మెదడుపైన, మెదడు ప్రభావం దేహం మీద పడుతుంటుంది.

కుడి ఎడమ మెదళ్ళు స్వతంత్రంగా వ్యవహరిస్తాయనీ ప్రయోగాల వల్ల రుజువైంది. పక్షవాతం సోకినపుడు ఒక వైపు మెదడు క్రియాశీలతను కోల్పోయినప్పుడు మరొకవైపు అవయవాలు అదుపు తప్పడానికి ఇదే కారణం.

ప్రకృతిని పరిశీలించడం, జ్ఞానాన్ని అర్జించడం, జ్ఞానాన్ని నిక్షిప్తం చేయడం, విశ్లేషించడం, ఏమిటి? ఎందుకు? ఎలా? లాంటి ప్రశ్నలు వేసుకోవడం, ప్రకృతి సత్యాలను రాబట్టడం, ప్రకృతి ప్రవర్తనను అవగాహన చేసుకోవడం, స్వేచ్ఛగా సంకల్పించడం, నిర్ణయాలు తీసుకోవడం, ఆచరణలో పెట్టడం, ఫలితాలను సమీక్షించి వైఫల్యం చెందితే పునఃప్రయత్నించడం, భావోత్పత్తి చేయడం, వాటిని వ్యక్తీకరించడం, ఇతరులు వ్యక్తపరచిన భావాలను విమర్శనాత్మకంగా గ్రహించడం, సామరస్యపూరక సామాజిక సంబంధాలతో స్వేచ్ఛను పొందడం మానవుని ప్రత్యేక పరిణత లక్షణాలు.

ఆలోచించడం మన మెదడు యొక్కపని. దాని లక్షణం. దీనివల్ల మనస్సు రూపుదిద్దుకుంటుంది. మనిషి చనిపోయి మెదడు జీవరసాయిన నిర్మాణం చెడితే మెదడు లక్షణమైన ఆలోచన, మనస్సు స్తంభించిపోతాయి. మనస్సు 'నేను' అనుకుంటే అది ఆత్మగా పొరబడ్డారు మన రుషులు. రుష్యవారసత్వంగానే శ్రీకృష్ణుడు వ్యాసుని భావాలను వెల్లడించాడు.

మెదడులో 80% నీరు వుంటుంది. ఈ దేహం నశించిన పిమ్మట దాని లక్షణమైన



16

మనస్సు స్తంభించిపోతుంది. మెదడు భౌతిక రసాయన పదార్థాలైన కార్బన్‌డయాక్సైడు, నీటి ఆవిరి, నత్రజని వాయువులుగాను, నేలలో కలిసే ఉప్పులాంటి లవణాలుగా మారుతుంది. బయటకుపోవడానికి ఆత్మఉండదు. వస్తువు యొక్క సంక్లిష్ట నిర్మాణం లేకుండా దాని ప్రత్యేక లక్షణం ఉనికిలో వుండదు. మనస్సు నిర్వచనీయం, మరణంతో అంతరిస్తుంది. హత్య జరగాలంటే ఆలోచించగల మరొక మనిషి ఉంటాడు. చంపేది చంపబడేది మనస్సు. మనస్సు ఒక జీవిత కాలంలో పుడుతుంది. పెరుగుతుంది. భావ సకారవికారాలను పొందుతుంది. శాశ్వతమేమీకాదు. పురాతనమైనదీకాదు. మనస్సు మానవుడితోనే ఆవిర్భవించింది. అతనితోనే అంతరిస్తుంది. మనిషి మరణించినపుడు దహన సంస్కారములు చేయకముందే అదృశ్యమౌతుంది. సరిగా ఆక్సిజన్ మెదడుకు అందనట్లయితే మనస్సు మెదడుతో అంతరిస్తుంది. మనస్సు సర్వవ్యాపికాదు. పదార్థ పరిణామంలో మధ్యలో ఆవిర్భవించిందే మనస్సు. సనాతనము కాదు. ఇతరుల మనస్సును మనం తెలుసుకోవచ్చు. మన మనస్సును మనం తెలుసుకోవడానికి ఇంద్రియాల అవసరంలేదు. పుట్టినవానికి మరణాన్ని పొడిగించవచ్చు, మరణించిన పిమ్మట పునర్జన్మ ఎత్తడానికి మనస్సుకాని ఆత్మకాని మిగలవు.

అందువల్ల 'ఆత్మ' అభూతకల్పన అంటున్నాం. ఆత్మలు ఉనికిలో లేవంటున్నాం. 'ఆత్మ' లేనందువల్ల పూర్వజన్మ, పునర్జన్మలు అబద్ధాలంటున్నాం. కనుకనే పూర్వజన్మ కర్మఫలాలు అబద్ధాలు. కర్మసిద్ధాంతం శాస్త్రీయం, హేతుబద్ధం కావంటున్నాం. మెదడు లక్షణమైన ఆలోచన ఉండగానే ఉన్న ఈ ఒకేఒక్క జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలంటున్నాం.





17

# సత్తు - చిత్తు సమస్య

-రావిపూడి వెంకటాద్రి

సత్తు - చిత్తు సమస్య చాలాపాతది. దీని అవగాహనలో, వ్యాఖ్యానంలో పెల్లుబికిన తేడాలే భౌతిక భావవాదాలుగా రాటుదేలాయి.

సత్తును (Being or Existence) ప్రాథమికమైనదిగా, చిత్తును (Consciousness) వ్యుత్పన్నలక్షణంగా పరిగణించేది భౌతికవాదంకాగా, చిత్తును ప్రాథమికమైనదిగా, సత్తును వ్యుత్పన్నలక్షణంగా, చిత్తుకు ప్రతిచ్ఛాయగా భావించేది భావవాదమైంది.

దేహాత్మసమస్యగా దీనిపై చాలాకాలంగా చర్చ జరుగుతూ వచ్చింది. ఈ సత్-చిత్ సమస్యను వివరించడంలో భారతీయ భావవాదధోరణి రకరకాల ద్వైతాద్వైతాల మధ్య నిర్విరామంగా వూగులాడింది.

అసలు ఈ సత్తు - చిత్తు అనేవి ఏమిటి ? సత్ అంటే ఉనికి కలది. అదొక వాస్తవికతసత్తా (Objective entity). ఏది వున్నదో అదంతా సత్తాయే.

అయితే, వున్నదంతా సత్తా అయిననపుడు, చిత్ అంటే లేనిదనా భావం ? కానేకాదు. 'ఉన్న దాని ప్రవృత్తిని (Function) దానినుంచి విడదీసి చిత్ అంటున్నాం. చిత్‌నే చైతన్యం అని కూడా అంటున్నాం. ఈ చిత్‌నే ఆధ్యాత్మిక భావవాదులు ఆత్మ అన్నారు. సాధారణ ప్రజలకిది మనస్సుగా మాత్రమే తెలుసు.

మనకు వస్తువుల్ని గురించిన స్పృహ (awareness) వుంది. జీవులన్నిటిలోనూ ఆ స్పృహవుంది. అందులోను, ప్రత్యేకించి మనుషుల్లో పరిసరాలను గురించిన స్పృహ అధికతరంగానూ, అధిక గుణాత్మకంగానూ వున్నది. జీవ పరిణామదశల్లో నానాటికి ఈ స్పృహ వృద్ధిపొందుతూ వచ్చింది. మనిషిలో పతాకస్థాయికి చేరుకొన్నది. అయినా, పరిసరాలను గుర్తించి ప్రతిస్పందించగల లక్షణం జీవులన్నింటిలోనూ తరతమస్థాయిలలోవున్నది. దాన్నే మనం చైతన్యమనీ, చిత్తనీ పేర్కొంటున్నాం. దీన్నే మనం మనస్సు (mind) అని కూడా అంటున్నాం. "చైతన్యమంటే అదికాదు, ఇదికాదు, మరేదీలేదు, అది అదే" నంటూ మార్మిక భావగానంచేసే అధ్యాత్మిక భావవాదులకేనాడూ సత్తూ అందలేదు, చిత్తూ అందలేదు.

భౌతికవాదం అనాదినుంచీ చిత్తును ఈ ప్రపంచంలోనే చూస్తున్నది. భావవాదులకు ప్రపంచమేలేదు కాన, ప్రపంచాన్ని విడిచిపోతేతప్ప వారికి శుద్ధ చైతన్యం కనిపించదు.

మనస్సు అనేది మెదడుయొక్క ప్రవృత్తి తప్ప, అన్యంకాదని భౌతిక వాదులు బహుకాలంగా చెపుతున్నారు. దేహం పదార్థమే, అందలి మెదడూ పదార్థమే. జీవం అనేది ఎలా ఒకానొక నిర్మాణంలో ఉన్న పదార్థప్రవృత్తో, అలాగే మనస్సు కూడా ఒకానొక నిర్మాణంలోవున్న మెదడుయొక్క ప్రవృత్తి అని భౌతికవాదం అంటుంది. ఇది సరయినదికాదని అనుకోవడానికి వీలులేదు. ఎందుకంటే, ఎక్కడయినా మెదడులేని మనస్సు వున్నట్లు మనకు దాఖలా లేదు. ఆత్మభావాన్ని కనిపెట్టిన భావవాదులకు ఆలోచనలు మెదడులో బయలుదేరతాయన్న విషయం తెలియదు. మనస్సు (చైతన్యం) ఎక్కడ ఎలా బయలుదేరుతుందో ప్రాథమిక సమాచారమయినా తెలియనివారు వేలసంవత్సరాలనాడు కనిపెట్టిన ఆత్మసిద్ధాంతమే ఈనాడు కొందమంది సైన్సు చదువుకున్నవాళ్ళనీ, చాలా మంది ఉద్యోగులనీ మైకంలో ముంచివేస్తున్నది.



18

మనస్సు లేనిచోట జ్ఞానమూలేదు. కాబట్టి మనం చైతన్యం అనేది మెదడును ఆశ్రయించివుంటుంది. ఆత్మఅనేది ప్రత్యేకంగా ఏమీలేదు. శుద్ధ చైతన్యం, శుద్ధమనస్సు అనేవి అబద్ధాలు. దేహప్రవృత్తికి అన్యంగా, దేహానికి విడిగా చైతన్యమనే ప్రత్యేకవస్తువు వున్నదని వూహలు చేయడమైతే చాలాకాలంగా జరుగుతూవచ్చింది కాని, అది అలా ఎన్నడూ రుజువు కాలేదు. దాన్ని రుజువు చేయడానికి ఆధునికశాస్త్ర ప్రక్రియలద్వారా, పరిభాషద్వారా కొందరు చేస్తూవస్తున్న ప్రయత్నాలు ఫలించలేదు.

అయితే, పదార్థంనుంచి వ్యుత్పన్నమయిన (derivative) లక్షణం ఆ పదార్థాన్ని ఎలా గ్రహించగల్లుతున్నది ? అంటే, వ్యుత్పన్నలక్షణాలు మూల వస్తులక్షణాలను ఎలా గుర్తించగల్గుతున్నాయి ? ఇదీ భావవాదుల ప్రశ్న. వారి వద్ద ప్రశ్నలు తప్ప సమాధానాలుండవు. భౌతికవాదులుచెప్పే సమాధానాలు వారికి తృప్తినివ్వకపోతే, "కాబట్టి భావవాదం సరయినది" అని అజ్ఞానంలో సేదదేరడానికి సంసిద్ధమవతారు.

వాస్తవమేమంటే, మూలవస్తువులను గ్రహించి గుర్తించగల లక్షణాలు కూడా వ్యుత్పన్నలక్షణాలతోపాటే నిష్పన్నమవతాయి.

గ్రహించగలిగే శక్తి వస్తుస్వభావంలో భాగమేనని, వస్తు నిర్మాణంలోని ఒకానొకదశలో వస్తువుతోపాటే అది నిష్పన్నమవుతుందనీ, అది వస్తువులోని అంతర్భాగమేననీ, అలాకాకుంటే ప్రకృతిలో భిన్న వస్తువులుండడానికి వీలులేదనీ వారు గుర్తించడంలేదు. ప్రకృతికి అతీతమైనదేదో (Supernatural) వున్నదనేభావం సాంప్రదాయికంగా సంక్రమించినందువల్ల, వారిలో ఇట్లాంటి ప్రశ్నలు బయలుదేరుతున్నాయి.

విజ్ఞాన వాస్త్రం ఈనాటి స్థాయికి పెరగని రోజుల్లో – విశ్వపరిణామం గురించీ, జీవపరిణామం గురించి శాస్త్రీయ అవగాహన లభ్యంకాని రోజుల్లో ఇలాంటి ప్రశ్నలు వచ్చాయంటే మనం అర్థచేసుకోవచ్చు, కాని, ఈ రోజుల్లో అవి రావలసినవి కావు. 'విజ్ఞానశాస్త్రం' అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పగలుగుతుందా ? అన్ని సమస్యలనూ తీర్చగలుగుతుందా ? అని అడగవచ్చు. చెప్పలేకపోవచ్చు. తీర్చలేకపోవచ్చు. కాని – చెప్పుకోవలసిన మార్గాన్ని, తీర్చుకొనే మార్గాన్ని, ప్రశ్నల ఔచిత్యాన్ని, సమస్యల అవగాహనను నిర్దేశించేస్థాయికి ఆధునిక విజ్ఞానం చేరింది. అందువల్ల మనం వేసుకొనే ప్రశ్నలుకూడా అర్థవంతాలయి వుండాలి.

విశ్వపరిణామం విశ్వం ఉనికిలో భాగమే. ఉనికి పరిణితులు (being and becoming) విడదీయరానివి, (indivisible). వస్తు లక్షణాలను ఆ వస్తువు నుంచి తొలగించటం సాధ్యంకాదు. అలా తొలిగించగలిగితే ఆ వస్తువు మరో వస్తువవుతుంది. అదీ పరిణామమే. పరిణామంలో ఉనికి అనేకదశలు మారుతూవస్తున్నది. అలాంటిదశల్లో అంతకుముందెన్నడూ లేని జీవం ఆవిర్భవించడం, దాని పరిణామంలో తమకు వెలుపలవున్న ప్రపంచాన్ని గుర్తించి, గ్రహించి, ప్రతిస్పందించగల చైతన్యం నిష్పన్నం (emerge) కావడం విశిష్టమైనవి. ఈ చైతన్యం నిష్పన్నంకాక పూర్వం ప్రకృతి పరిణామ క్రమమంతా ప్రేక్షకులులేని నాటక ప్రదర్శనవంటిది. ఆ పరిణామాన్ని గమనించి, స్పందించి, ప్రతిపాదించి, అనుభూతి పొందినవారు ఆ దశలో లేరు. ఆ స్పందనాదులు మనిషితోపాటు వచ్చాయి. అంతకుముందు సంవేదనలు (sensa-

tions) లేవు. వాటిని పొందగలవారు లేరు. రంగు, రుచి, వాసన లేవు. జ్ఞానం, ఉద్వేగం, సుఖం, దుఃఖం, సంతోషం, బాధలేవు. ఆ లక్షణాలనుపొంది ప్రదర్శించగల మెదడులేనపుడు అవి వుండడం సాధ్యంకాదు.

మెదడును రెండు అర్ధగోళాలుగా విడగొట్టి, మెదడు ప్రవృత్తిపై అపూర్వ పరిశోధనలు విజయవంతంగా సాగించగలిగినందుకు 1982లో నోబుల్ బహుమతి పొందిన డా॥ రోజర్ డబ్ల్యు. స్పెర్రీ ఈ విషయాన్ని ఇలా వివరించాడుః

....there seems to be good reason to regard the evolutionary debut of consciousness as very possibly the most critical step in the whole of evolution. Before this, the entire cosmic process, we are told, was only, as some one phrased it, "a play before empty benches, colorless and silent at that, because according to our best physics, before brains there was no colour nor sound in the Universe, nor was there any flavour or aroma and probably rather little sense and no feeling or emotion... All of these can now be generated by the surgeon's electrode tip applied to the proper region of the exposed conscious brain. They can be triggered also, of course by the proper external stimuli but also more interestingly, be centrally iniciated dream states, illusiono - genic and hallucinogenic agents, but **always and only within and by a brain**. There probably is no more important quest in all science than to attempt to understand those very particular events in evolution by which brains worked out that special trick that has enabled them to add the other facets of mental experienc

[R.W. Sperry : The Encyclopadia of Ignorance, P.424]

మానవుడి మెదడు రకరకాల స్పందనలకు కేంద్రం కావడం మాత్రమే కాదు, మెదడులోని ఆయాభాగాలకు శస్త్రవైద్యుడి ఎలక్ట్రోడ్‌కొనను తాకించడం వల్లనూ, ఇతర బాహ్య ప్రేరణలవల్లనూ మనిషి మెదడులో పైన పేర్కొన్న స్పందనలన్నింటినీ కల్గించవచ్చు. భ్రమలను, భ్రాంతులను కల్గించవచ్చు. నిద్రావస్థను, స్వప్నావస్థను కల్పించవచ్చు. కాని, **ఈ స్పందనలన్నీ మెదడులో మాత్రమే, మెదడువల్ల మాత్రమే సాధ్యమౌతాయి**. మెదడు వెలుపల అవి ఏమీ జరగవు. అంటే మనం మానసిక చేష్టలుగా, వికారాలుగా చెప్పుకునేవన్నీ ఎక్కడో మనస్సు అనే వేరే వస్తువులోకాక, మెదడులో మాత్రమే జరుగుతాయని అర్థం చేసుకోవాలి. అవసరమైతే, మనం వాటిని కల్పించవచ్చు తప్ప, వాటిని విశ్వాతీత శక్తులు కల్పిస్తున్నవని అనుకోవడం సరయిన విషయంకాదు.

వస్తువుల ఉనికిని గ్రహించడానికీ, ఆ వస్తువుల ఉనికికి ప్రతిస్పందించడానికీ ఏయే అంశాలు ప్రేరేపిస్తున్నవో, వాటిని ఆ వస్తువుల ధర్మాలుగా (Properties), లక్షణాలు, లేక గుణాలుగా మనం ముద్రవేస్తున్నాం. అంత మాత్రాన వస్తువులు మన మానసిక దశలు (Mental states) కావు. మనః కల్పితాలు కావు. జ్ఞానేంద్రియాలు (Sensory organs) 'బాహ్య ప్రకృతి' నుంచి నిర్గుణత్వాన్ని గ్రహించడమనే సమస్య ఉత్పన్నం కాదు. వస్తువు ఉన్నికికీ, పరిణతికీ మన మెదడులో బయలుదేరే ప్రతిస్పందనలకు పూర్వమే ప్రతిస్పందించే మెదడు,



20

ప్రతిస్పందన కారకాలు వుండాలి. ఆ మెదడుకు సంవేదనల్ని చేరవేసే జ్ఞానేంద్రియాలు, వాటిని ప్రేరేపించే భౌతిక ప్రపంచమూ ఉండాలి. మెదడులోని ఆయా ప్రాంతాలను కదిలించడం ద్వారా మనం కృత్రిమంగా సంవేదనల్ని కల్గిస్తున్నామంటే, మెదడును ఆవేశపరుస్తున్నామన్నమాట, ఈ ఆవేశాన్ని మనం మనస్సు అంటున్నాం. మెదడులేని మనస్సులేదు. అందుకే అంటున్నారు Mind is the charge of the brain స్పెర్రీ ప్రభృతులు,

ఈ ఆవేశం ఒకసారి వుత్పన్నమైన తరవాత, అది మెదడును కూడా నడుపుతుందంటాడు స్పెర్రీ. దేహంలో వుత్పన్నమైన జీవశక్తి (Life force) దేహాన్ని నడిపినట్లే మెదడులో వుత్పన్నమైన మానసిక ఆవేశం మెదడును నడుపుతుంది. **మన పరుగులో ప్రారంభమైన గతి శక్తి (గమనం) మనల్ని ముందుకు త్రోసినట్లే, మన మెదడులో బయలుదేరే ఆవేశం మన మెదడును నడుపుతుంది. ఆ ఆవేశంచేస్తున్న కార్యక్రమాన్నే ఆలోచన అంటాం. ఈ ఆలోచన భౌతిక ప్రపంచాన్ని గురించినదే, అదిలేకపోతే ఇదిలేదు. మన ఆలోచన ఒనానొకదశలో మలుపుతిరగవచ్చు, ఆగిపోవచ్చు. మలుపుతిరిగినా, ఆగిపోయినా, మరల బయలుదేరినా, మెదడు చర్యవల్లనే జరగాలి. మెదడులోపలే జరగాలి.** అలానే ఉద్వేగాలు (emotions) కూడా, ఏ మానసికస్థితి అయినా, మెదడులో బయలు దేరవలసినదే. అంటే మనస్సు అనేది మెదడు యొక్క ప్రవృత్తి వల్ల బయలుదేరుతున్న లక్షణమేనని దీనివల్ల తేలుతుంది. అయితే ఆ మెదడు సజీవమైనదై, క్రియాలోలమైనదై (Living brain in action) వుండాలి. అంటే మానసికచర్యలు జీవంతో ముడిపడివున్నాయన్నమాట, కాబట్టి, రాళ్ళకు రప్పలకు ప్రాణమున్నదని భావించే యానిమిస్ట్‌ధోరణి అసంబద్ధమైనది.

మెదడు దేహానికి విబంధంగాలేదు. అది దేహంలోభాగం. చర్మం, కన్ను, ముక్కు చెవి, నాలుక అనే జ్ఞానేంద్రియాలుకూడా దేహంగాలే. అవి ఆయా నాడులద్వారా మెదడుకు సందేశాలను మోసుకువెళ్ళకపోతే, ఆయా స్పందనలు, ప్రతిస్పందనలు, జ్ఞానం మొదలయినవి సాధ్యంకావు. అవయవాలు ఎలాంటి సంవేదనల్ని మెదడుకు మోసుకువెళ్ళితే, అలాంటి ప్రతిస్పందనలే మనం మెదడు నుండి ఆశించగలం. ఇక్కడ ఒక ముఖ్యాంశాన్ని మనం గుర్తుంచుకోవాలి. మనుషులందరికీ సార్వజనీనంగా అవయవాలు ఒకే విధంగా అమరిన్నాయి. అందరికీ వాటి ప్రవృత్తులు ఒకే విధంగా వున్నాయి. అందువల్ల మనుషులందరికీ ఈ ప్రపంచాన్ని గురించి ఒకేవిధంగా అనుభూతి కల్గుతుంది. అందువల్లనే సహకార సామాజిక జీవనంకూడా సాధ్యమవుతున్నది. అందరి చర్మాలు, కళ్లు, ముక్కుచెవులు, నాలుకలు అయా ప్రేరణలకు ఒకేవిధంగా ప్రతిస్పందించి ప్రతీకరిస్తాయి. మనుషులందరకూ రాతిముక్క కఠినంగానూ, తారు నల్లగానూ, మల్లెపువ్వు సువాసనతోనూ, కంచు గంట మ్రోత టంగుమంటూనూ, బెల్లం తియ్యగాను వుంటాయి. అవి వాటి వాస్తవికలు.

మనిషికి అందే సత్యం ఎప్పుడూ వస్తువుల ప్రేరణలకు మనిషి మెదడులో కలిగే ప్రతిస్పందనలను ఆశ్రయించివుంటుంది. అందువల్ల, వాస్తవికసత్యం (objective truth) మానవికం (human). అదే, మానవుడికి తెలిసేదీ, తెలియవలసిందీకూడా. 'అదికాని సత్యాన్ని' గురించి తపించడం అర్థహితం. జ్ఞానేంద్రియాల్లో వికారాలున్నవారినీ, ఉన్మాదుల్నీ, చిత్తభ్రాంతి కలవారినీ వదలి వేస్తే– మనమందరమూ ఎలా గ్రహించగలిగితే అలావుంటుంది సత్యం. మన


24

మీద ఎలా ప్రభావాన్ని చూపగిలిగితే అలా వుంటుంది సత్యం. దాన్నే మనం మన నిజజీవితంతో అనుసంధిస్తాం. సార్వజనీన విషయికంగా చూస్తే, మన అవయవాలు ఎలాగ్రహిస్తే మన జ్ఞానం అలావుంటుంది, మన అవయవాలు మనకు సత్యాన్ని గురించి భ్రమలు కల్పిస్తే, వాటిని సవరించుకోడానికి శాస్త్ర విజ్ఞానాన్నీ, శాస్త్రీయపరికరాలనూ వినియోగించుకొంటాం.

**మన అవయవాల నిర్మాణం, వాటిపొందిక, అవి పరిసరాలకు ప్రతిస్పందించేతీరు మరొకరకంగావుంటే, మన జ్ఞానం - దాని మీద ఆధారపడే సత్యం మరొకరకంగా వుండేవి. కాని అలాలేవు, ఇలానే వుంటున్నాయి. కాబట్టి మానవికసత్యం ఇలానేవుంటుంది. మానవికంకాని సత్యం మానవులకందదు, అందువల్ల "అసలు సత్యరూపమేమిటి ?" అంటూ శుష్కవేదాంత చర్చను సాగదీయడం వైజ్ఞానిక సోమరితనానికి నిదర్శనం. నిజజీవితంలో అన్వయించుకొని, స్వేచ్ఛావంతమయిన సుఖకరమైన జీవితాన్ని గడపడంకోసం మానవుడు మానవికమైన సత్యాన్ని గ్రహిస్తాడుతప్ప, అంతకంటె అన్యమైన ప్రయోజనం సత్యంవల్ల లేదు. దైవభజనలాగా సత్యభజన చేయడంకోసం మనం సత్యశోధన చేయడంలేదు. ఈ విషయం గ్రహించనివారికి సత్యంలో వాస్తవికత, వాస్తవికతలో సత్యం కనింపంచవు.**

మనజ్ఞానం ఇలాకాక మరొకరకంగా ఎందుకులేదు ? ఈ ప్రపంచాన్ని ఇలాకాక మరొకరరంగా మనం ఎందుకు దర్శించడంలేదు ?

**ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్కటే. మన అవయవనిర్మాణం ఇలా వున్నదికాన, ప్రపంచాన్ని మనం ఇలా దర్శిస్తున్నాం. మరొకరంగావుంటే, మరొరకంగా దర్శించేవాళ్ళం. ఆ మరొకరకమైన దర్శనమే అప్పుడు మనకు వాస్తవికసత్యమయ్యేది. ఆ సత్యం ప్రకారం మనం మన జీవితాలను సరిదిద్దుకొనేవాళ్ళం. ప్రకృతిలో మనం "అలాకాక ఇలా" తయారయ్యాం. కాబట్టి ఈ స్థితినుంచే మనం సత్యాన్ని అవగాహన చేసుకొంటాం.**

సర్జరీద్వారా మన మెదడును $180^0$ త్రిప్పితే మన కంటిదృష్టిలో (Visual perception) ఎలాంటి మార్పువస్తుంది అనే ప్రశ్న ఆ మధ్య మనో జీవశాస్త్రజ్ఞుల (Psychobiogists) మధ్య తలెత్తింది. మెదడును అలా త్రిప్పడం సాధ్యకాలేదుకాని, క్రిందిజాతి సకసేరుకాల (Lower vertebrates) కనుగ్రుడ్లను సర్జరీద్వారా $180^0$ త్రిప్పి,కుడియెడమలు మార్చి, తలక్రిందులు చేసి రకరకాలుగా అమర్చి ప్రయోగాలు చేశారు. ఆ జంతువులు చూపిన ప్రతిస్పందనల్లో క్రిందనుమీదుగా, కుడిని యెడమగా, ముందును వెనుకగా రనకరకాలుగా అనుభూతి పొందినట్లు తేలింది. అంటే ఏ రకమైన నరాల సంవిధానం ప్రకృతి పరిణామసిద్ధంగా చేకూరుతుందో దానికి అనుబంధించబడి సహజదృష్టి వుంటుదన్నమాట ! దీన్నే స్పెర్రీ,

(............... Visual perception was very closely tied indeed to the underlying inherited structure of the natural machinery" (ibid. p.426) అన్నాడు.

ఏ జ్ఞానేంద్రియాలతోనైనాసరే, మనం ప్రకృతిని గమనించవలసినతీరు మన అవయవాల నిర్మాణంలో నిహితమైవుంటుంది. ఆ నిర్మాణం కోట్లాది సంవత్సరాల పరిణామంలో క్రమక్రమంగా అమరింది. పరిణామంలో రూపొందిన బాహ్యేంద్రియాల శక్తిని అధిగమించి – ఆ పరిణామంలోనే యేర్పడిన మెదడుయొక్క సమర్థతవల్ల మానవుడనేక విజయాలు సాధించాడు. కాలాన్నీ, దూరాన్నీ

జయించాడు. స్థూలాన్నీ, సూక్ష్మాన్నీ జయించాడు. ఆకాశాన్నీ, భూమినీ జయించాడు. టెలిస్కోపులు, మైక్రోస్కోపులు, విమానాలు, రాకెట్లు, యక్స్‌రేలు, స్కానింగులు, ఆడియోలు, వీడియోలు, వాటికి మీటర్లు - ఇంకా ఎన్నెన్నో నిర్మించుకొని ప్రకృతిని అధ్యయనం చేశాడు. చేస్తున్నాడు. ఈ సాధన అంతా అతని సత్యదర్శనంలో భాగమే. ఈ సత్యదర్శనం వెనకయెంతో కృషి, త్యాగం, చరిత్ర వున్నాయి. జ్ఞానేంద్రియాలనూ, బుద్ధినీ బంధించడంవల్ల సత్యదర్శనం సాధ్యంకాదు. యోగాలు, భావాతీత ధ్యానాలు భ్రమలకు తప్ప, సత్యానికి దారితీయవు. శైశవంనుంచి ప్రౌఢత్వం వచ్చేవరకూ, ఇంకా తర్వాతనూ వ్యక్తిబుద్ధి ఎలా వికసిస్తుందో, అలానే ఆదిమానవుడి నుంచి ఈనాటి వరకూ నడచిన చరిత్రలో మానవజాతి బుద్ధికూడా వికసించింది. అందుకు ధారణ, సంస్కారం, సామాజిక జీవనం సహాయపడ్డాయి. అందువల్లనే సామాజిక జీవనంలో అలవడిన భావాలు, ఆచారాలు మన ఉద్వేగాలపైనా, భావాలపైన సైతం ప్రభావాన్ని చూపిస్తాయి. వాటికిన్నీ మనం ప్రతిస్పందిస్తాం. ఈ వాస్తవాన్ని గ్రహిస్తే ఈనాటి విజ్ఞానాన్ని సాధనంగా వుపయోగించుకొని ఏనాటి అజ్ఞానాన్నో, సమర్థించే దౌర్భాగ్యస్థితికి దిగజారిపోవడం జరుగదు. గతానికి విలువకట్టడంవేరు, దాన్ని సమర్థించడంవేరు.

మనం జ్ఞానం ఆర్జిస్తున్నామంటే, మన కళ్లు, ముక్కు, చెవి, నాలుక, చర్మం, మెదడు (మనస్సు) ఇతర వస్తువులవద్దకు ప్రయాణంచేసి వాటిని గ్రహించడంకాని, కదపడంకాని, చెరచడంకాని చేయడం లేదు. కొందరు చూస్తేనే వస్తువులు చెడిపోతాయనే నమ్మకం చాలమందిలో బలంగావుంది. దీన్నే దృష్టిదోషం (దిష్టి) అనికూడా అంటారు. కొందరు మనో విజ్ఞానం పేరుతో ప్రచారం చేస్తున్న సైకోకెనెసిస్ దాని వికృతరూపమే.

మన గ్రహణేంద్రియాలు వస్తువులవద్దకు ప్రయాణం చేసి వాటిని గ్రహిస్తాయనేది అబద్ధం. వస్తువులవద్దనుంచి వచ్చిన సంకేతాలు మన గ్రహణేంద్రియాలను తాకడంవల్ల గ్రహణేంద్రియాలు ప్రతిస్పందిస్తాయి. ఇలాంటివన్నీ విజ్ఞానశాస్త్రంలో ప్రాథమిక విషయాలు, మునులు గుడ్లెర్రజేస్తేనో, శపిస్తేనో అవతలివాళ్ళు భస్మమైపోయేవారనేవన్నీ పౌరాణిక కట్టుకథలు వాటితో 'మనసుల్ని' కలుషితంచేసుకొన్న మనుషులు సైకోకెనెసిస్, టెలిపతీ, క్లైయిర్‌వాయెన్స్. ఎక్స్ట్రాసెన్సరీపర్సెప్షన్ (ESP) వంటి బూటకాలను నమ్ముతారు. అలాంటి వారిలో ద్వంద్వవ్యక్తిత్వాలు ప్రతిబింబిస్తుంటాయి. కాకుంటే దేన్నీ సృష్టించడం సాధ్యంకాదని ఆధునిక విజ్ఞానశాస్త్రం చెపుతుంటే, ఆ శాస్త్రజ్ఞుల్లోనే కొందరు సృష్టి జరిగిందనీ, దానికొక కర్తవున్నాడనీ ఎలా నమ్ముతున్నారు? వారి వృత్తి శాస్త్రం, సంస్కారం మతం. అందువల్ల వాటి రెంటి మధ్య వైరుధ్య మెక్కడుంది?" అని ప్రశ్నిస్తారు ఒకవైపు వైరుధ్యాలను నమ్ముతూనే. ఇంతకూ చెప్పవచ్చేదేమంటే, మనస్సు (సైక్) బయటకు ప్రయాణం చేస్తున్నట్లు ఏనాడూ శాస్త్రీయంగా రుజువుకాలేదు. మెదడు పొరల్లో దాగివున్న జ్ఞాపకాలు ప్రకంపనాల ద్వారా నెమరుకు వస్తాయితప్ప, మనోవేగమనేదికూడా ప్రత్యేకంగా ఏమీలేదు.

దేహం మనస్సునూ, మనస్సు దేహాన్నీ ప్రభావితంచేస్తాయి. ఒకదాన్ని ఒకటి అదుపుచేస్తాయి. అయితే, ఇవి ఎలా జరుగుతున్నాయి అనేందుకు అధునిక మనోజీవశాస్త్ర (Pschobiology) ప్రయోగాలు ఏమి చెపుతున్నాయో చూడాలి.

మెదడు నిర్మాణాన్ని గురించీ, ప్రవృత్తినిగురించీ ఇటీవలికాలంలో మనో జీవశాస్త్రంలో

జరిగిన ప్రయోగాలు మనకు కొన్ని విశేషాలను తెలియజేస్తున్నాయి. మెదడు రండు అర్ధగోళాలుగా వుంటుందనీ, ఆ రెండు భాగాలూ నిర్మాణ రీత్యా ఒకేవిధంగావున్నట్లు కన్పిస్తాయనీ, కోట్లాది నరాలతో పరస్పరం అనుసంధానం పొందివుంటాయనీ ఇంతకుపూర్వమే తెలుసు. కానీ, 1960లో రోజర్‌స్పెర్రీ మెదడు యొక్క రెండు అర్ధగోళాలను సర్జరీద్వారా విడగొట్టి పరీక్షించాడు. అవి చేసేపనుల్లో ప్రత్యేకతలు వున్నట్లు గమనించాడు.

నైరూప్య ఆలోచన, సాంకేతిక సంబంధాల వివరణ, విశ్లేషణాశక్తి, తార్కికపటిమ, గణితం, మాట్లాడడం, వ్రాయడం – ఈ విషయాలకు సంబంధించిన పని అంతా మెదడు ఎడమ అర్ధగోళంలో జరుగుతుంది. మనిషిలో మేధోసంబంధమైన కృషి అంతా ఈ ఎడమ అర్ధగోళంలోనే జరుగుతుంది.

కుడి అర్ధగోళం చదవడానికి తప్ప, వ్రాయడానికి సాయపడదు. నామ వాచకాలు తప్ప, విశేషణాలు దీనికి అర్ధంకావు. లెక్కల్లో 20 వరకు కూడగలదు కాని, తీసివేత, గుణకార, భాగాహారాలు దీనివల్లకావు. పరిచయాలను, స్థలాలను గుర్తుంచుకోగలదు. దీన్ని మందకొండి అర్ధగోళంగా గుర్తించవచ్చు.

రెండు అర్ధగోళాలకూ ఉద్వేగాలున్నాయి. కాగా, ఎడమ అర్ధగోళాన్ని జిజ్ఞాసకూ, కుడి అర్ధగోళాన్ని కళాసృజనకూ కృషిచేసేవిగా స్పెర్రీ ప్రయోగాల్లో తేలింది. మనుషుల్ని జిజ్ఞాసువులుగా, కళాకారులుగా 60 యేళ్ల క్రితం పావ్‌లోవ్ చేసిన వర్ణన ఈ సందర్భంగా మనకు గుర్తుకు నస్తుంది.

అయితే, చైతన్యవంతమైన మనస్సు, మానసిక శక్తులు మెదడులో మాత్రమే బయలుదేరతాయని స్పెర్రీ ప్రయోగాలు ధృవపరచాయి. మెదడు పనిచేసే క్రమంలో నిష్పన్నమయ్యే లక్షణాలు మెదడును పని చేయించడంలో కూడా పాల్గొంటాయి. అయినా ఏ భౌతిక రసాయన నియమాల ప్రకారం మెదడు పనిచేస్తుందో, ఆ నియమాలకు భంగం కలగదు. ఈ నిష్పన్న లక్షణాలు మెదడు ప్రవృత్తిని నియత్రించే కారకశక్తిని (Casual potency) కల్గివుంటుంది. జీవాణువు యొక్క, జీవకణం యొక్క, నాడీ ప్రేరణల యొక్క కారకశక్తి ఎంత వాస్తవమో, భావాల కారకశక్తి కూడా అంతే వాస్తవం. భావాలు ఇతరభావాలను ప్రేరేపిస్తాయి. నూతన భావాలు రూపొందడానికి చోదకాలౌతాయి. ఈ విషయాన్నే స్పెర్రీ ఇలా వర్ణించాడు :

("........ The casul potency of an idea, or an ideal, becomes just as that of a molecule, a cell or a nerve impluse. Ideas cause ideas and help evolve new ideas. They interact with other mental forces in the same brain, in neighbouring brains and in distant, foreign brains".

[R.W. Sperry in noble Converasations. P.60]

అంటే మన భావాలు మనభావాలతోను, ఇరుగు పొరుగువారి భావాలతోను, దూరదేశాల్లో వున్న వారిభావాలతోను (అంటే వారివారి భావాలను విని, చదవి తెలుసుకొని) ప్రతిచర్యకులోనై, నూతన భావాల ఆవిష్కరణకు కారణాలవతాయి. (టెలిపతీ, ఇ,ఎస్.పి, సైకోకెనెసిస్ వంటి అతీంద్రియ – అంతరింద్రియ వ్యవహారాలన్నింటికీ స్పెర్రీ వ్యతిరేకం.)



24

మానసిక చర్యలకు సంబంధించిన మెదడుకు వెలుపల వెదకవలసిందేమీలేదు. ఈ చర్యల్ని ఇప్పటికి మనకు తెలిసిన భౌతిక రసాయనిక పరిభాషలో వివరించడం సాధ్యంకాకపోవచ్చు. వాటినియమాలు వాటికున్నాయి. ఇందులో అతీతమైనవీ, మార్మికమైనవీ ఏమీలేవు. మనకు తెలియని వాటికి అతీత్వాన్ని అంటగట్టిడం విజ్ఞానమార్గం కాదు, అజ్ఞానమార్గం.

మెదడులోని కుడి అర్థగోళం దేహంలోని ఎడమ భాగం అవయవాలపైన పనిచేస్తుంది. అలానే మెదడులోని ఎడమ అర్థగోళం దేహంలోని కుడిభాగం అవయవాలపైన పనిచేస్తుంది.

1962లో స్పెర్రీ జట్టులోని డా॥ ఫిలిప్ జే. వోగెల్, డా॥ జోసఫ్ ఇ. బోగెన్ అనే ఇద్దరు సర్జన్లు మూర్ఛ రోగులిద్దరి మెదడులను శస్త్రచ్ఛేదనద్వారా నిలువున రెండు అర్థగోళాలుగా విడగొట్టారు. ఆ రోగుల ప్రవర్తననుబట్టి పరిశీలిస్తే ఎవడికి వాడు రెండు మెదళ్ళున్న వాడివలె ప్రవర్తించాడు. ఒక అర్థగోళం పనిచేసినప్పుడు (లేక పనిచేయించినపుడు) రెండవ అర్థగోళం వున్నదనే స్పృహ దానికి లేదు. ఒకదాని ఉనికి రెండవదానికి తెలియదు. ఒకదాని పని రెండవ దానికి తెలియదు.

మెదడు భాగాలువిడగొట్టబడిన రోగికి బాగా పరిచయమున్న దువ్వెన, పెన్సిలు వంటి వస్తువు ఎడమచేతిలో వుంచితే కుడి అర్థగోళం గ్రహించింది. (అంటే స్పర్శేంద్రియం (చేయి) నుంచి సందేశం అందితే తప్ప మెదడు (మనస్సు) వస్తువును గుర్తించలేదు). ఆ వస్తువుల్లో దేన్ని ఎలా వుపయోగించాలో అలా ఉపయోగించడానికి ఆ చెయ్యి ప్రయత్నించింది (అంటే మెదడు నుంచి సందేశం అందితే తప్ప ఉదిష్ట కార్యానికి చేయి పూనుకోదన్నమాట) తనకు పరిచయమున్న వస్తువును అనేక వస్తువుల మధ్య వున్నప్పటికీ గుర్తించింది. కుడి అర్థగోళంలో ఈ పని జరుగుతున్నట్లు ఎడమ అర్థగోళానికి తెలియదు. "కుడి అర్థగోళంలో ఏమో జరుగుతున్నట్లువున్నది, ఏమిటిది ?. అని యెడమ అర్థగోళాన్ని ఒత్తిడిచేసి అడిగితే, అది ఊహించడానికి ప్రసయత్నించిందే కాని, చెప్పలేకపోయింది. పై వస్తువుల్ని కుడిచేతికో, కుడి ముఖభాగానికో తాకించినపుడు ఆ వస్తువు ఏమిటో యెడమ అర్థగోళం చెప్పగల్గింది.

ఇలాంటి ప్రయోగాలనే కంటి విషయంలో కూడా చేశారు. యెడమ అర్థగోళం ద్వారా కుడికంటి చూపును, కుడి అర్థగోళం ద్వారా ఎడమకంటి చూపును గ్రహించడం జరిగింది. కాని, యెడమ అర్థగోళం చూస్తూవున్నట్లు కుడి అర్థగోళానికి, కుడి అర్థగోళం చూస్తున్నట్లు యెడమ అర్థగోళానికి తెలియదు. నేటి వరకు జరిగిన ప్రయోగాల్లో కుడి కంటి వద్ద వున్న వస్తువును కుడి అర్థగోళం, ఎడమ కంటివద్దవున్న వస్తువును ఎడమ అర్థగోళం గ్రహించలేకపోయాయి.

ఒక మెదడులోనే రెండు అర్థగోళాల మధ్య ఇలాంటి దాగుడుమూతలుంటే, ఇక ఎవరిమెదడులోనోవున్న విషయాన్ని మరో మెదడు గ్రహించగలదనీ, అది అతీంద్రియ గ్రహణమనీ (Extra Sensory Perception) వాదించేవారిని మనం ఎలా అర్థంచేసుకోవాలి ?.

అంతేకాదు - మెదడు రెండు అర్థగోళాలుగా విడగొట్టబడిన తరువాత 6 నెలలకు అందులో ఒకడి ప్రవర్తనలో విడ్డూరాలు కన్పించాయి. కుడిచేయి ట్రౌజరు తొడుగుతుంటే, ఎడమచేయి విప్పడం ప్రారంభించింది. అతని భార్యను కుడిచెయ్యి దగ్గరకు తీసుకొంటుంటే,

ఎడమచేయి దూరంగా నెట్టింది. ఇదంతాచూచి కపాలం క్రింద రెండు "స్వేచ్ఛాసంకల్పాలు" (free wills)వున్నవా అనే అనుమానం కలిగే అవకాశంవుంది. అయినప్పుడు, ఒకే మనిషిలో రెండు చైతన్యాలు, రెండు మనస్సులూ వుండాలికదా? అనే సంశయంసైతం వస్తుంది. అవగాహన లోపం వల్లనే యిలాంటి అనుమానాలు బయలుదేరుతాయి. కాని, చైతన్యాన్ని, మనస్సుని, సంకల్పాన్ని, ఉద్వేగాలను, ఆవేదనలను, ఇతర మానసిక చర్యలను అన్నింటినీ మెదడు యొక్క ప్రవృత్తిలో బయలుదేరిన వివిధ అనుభూతులుగా మనం గుర్తించినపుడు, అలాంటి అధారరహిత సంశయాలు రావు. వచ్చినా నిలవవు.

విశ్వం నిత్యపరిణామి. పరిణామంలో ప్రతిదశలోనూ వస్తువైవిధ్యం గోచరిస్తుంది. ఆ వైవిధ్యం ధర్మవైవిధ్యంతో గుర్తించదగివుంటుంది.

విశ్వపరిణామంలో జీవం నిష్పన్నంకావడం ఒక ప్రత్యేకదశ. జీవం నిష్పన్నం కావడంతోనే జీవంతోపాటు స్పృహ అవతరించింది. పరిణామంలో అది అంతకంతకు పెరిగి మనిషిలో ఉచ్చస్థాయికి చేరుకుంది. ఇందులో లేనిది రావడం (holism) అనేది ఏమీలేదు. రెండు వాయువులు కలిసి నీరుగా మారినపుడు, నీటిలో 'తడి' రావడం హోలిజం అనుకుందామా - లా అనుకుంటే, దశలు మారినప్పుడల్లా హోలిజం వున్నట్లే. దశమారిపుడు ధర్మంద్వారా వస్తుధశను గుర్తిస్తాం. 'గుర్తించేధర్మం' మానవుడిలో పతాకస్థాయిని అందుకోవడమేకాదు, గుర్తించగల్గినకారణంగా మనిషి ప్రకృతిని తన మనుగడకు 'అనుగుణంగా' తీర్చిదిద్దుకుంటున్నాడు.

1950 మెదలుగా మనోజీవశాస్త్రంలో అపూర్వకృషి సలిపి అపూర్వవిజయాలు సాధించిన ఫలితంగా రోజర్ స్పెర్రీ 1982లో నోబుల్ బహుమానం పొందిన సందర్భముగా అమెరికాలో డల్లాస్‌లోని ఇస్ట్‌మన్ ఇన్‌స్టిట్యూట్‌లో "మెదడు-మనస్సు" మీద ఆ నవంబరులో యేర్పాటుచేసిన సంభాషణల్లో స్పెర్రీ వెల్లడించిన అభిప్రాయం ప్రకారం జీవశక్తులు జీవంలోనివేకాని, అతీతమైన వేమీకావు.

"............. The special vital forces that distinguish living things from the nonliving are emergent, holistic properties of the living entities themselves. They are not properties of their physicochemical components, nor can they be fully explained merely in terms of Physics and Chemistry. This does not mean that they are in anyway supernatural or mystical. Those who conceived vital forces in supernatural terms were just as wrong as those who denied their existance." N.Conservation. P. 77.)

(జీవుల్ని నిర్జీవులనుంచి వేరుచేస్తున్న ప్రత్యేక జీవశక్తులు జీవుల్లోవుండే విశిష్ట నిష్పన్నలక్షణాలే. అవి, వాటిని నిర్మిస్తున్న భౌతిక రసాయనికశాస్త్ర పదజాలంతో వివరించలేము. అంటే దీనిభావం అవి విశ్వాతీతమైనవీ, మార్మికమైనవీ అనికాదు. జీవశక్తుల్ని విశ్వాతీతశక్తులుగా భావించిన వారెంతప్పుచేశారో, అసలు ఆ జీవశక్తులనేవే లేవనేవారు అంతేతప్పుచేశారు.

అంతేకాదు Tao of Physics లో ఫిట్‌జాఫ్‌కాప్రా, Wholeness and the Implicate Order లో డేవిడ్‌భూమ్ వంటివారు భౌతికవిజ్ఞానాన్ని భావవాదంలోకి దిగజార్చడానికిచేసిన వికృతవాదాన్ని స్పెర్రీ మూలముట్టుగా తిరస్కరించాడు, సైన్సులో దేవుణ్ణీ, ఆత్మనూ చొప్పిస్తే



20

అవగాహన మెరుగుకాదా, అన్న వాఖ్యత ప్రశ్నకు సమాధానంచెపుతూ స్పెర్రీ ఇలా అన్నాడు.

" If we eliminate ghosts and angels and otherwordly forms of deity, devils and spirits of all kinds, myths of heaven, hell, astrology and the hereafter, witchery, the occult, the mystic, the paranormal and everything else that modern science rejects, what would we have left to beleive in ? (ibid).

అవును. దయ్యాలు, భూతాలు, పరలోకదేవలు, దేవదూతలు, స్వర్గ నరకాలు, జ్యోతిష్యం, మోక్షం, పిశాచాలు, చేతబడులు, క్షుద్రదేవతులు, మార్మికవాదం, అతీంద్రియశక్తులు మెదలయినవాటినన్నిటినీ ఆధునిక విజ్ఞానం తిరస్కరిస్తుంది. అవన్నీపోతే, ఇక మనం నమ్మడానికి మిగిలేదేమిటి ? కాబట్టి, లేనివాటిని ఆధారంగా తీసుకొని శాస్త్రవిజ్ఞానాన్ని పరిపుష్టం చేసుకోవాలనుకోవడం సరయిన పదద్ధతికాదు. దీనిపై స్పెర్రీపై వాఖ్యాత వ్యాఖ్యానం.

"Sperry argues that we should rigorously adhere to the demands of science, disavows otherwordly spirits and deities as explanatory factors in the evolving universe. In so dispensing with "god as a means of scientific interpretation, we lose none of the vastness, wonder and complexity of existence. (bid)

అసలు తమజ్ఞానానికి అందని ప్రతిదానికీ మనపూర్వులు విశ్వాతీతత్వాన్ని అంటగట్టారు. ఈనాటి వారు కొందరు శాస్త్రజ్ఞానం పేరుతో అదేతప్పును చేయడం చోద్యంగావుంది. విజ్ఞానశాస్త్రజ్ఞుల ప్రయోగాల్లో ఒక్కటంటే ఒక్కటయినా యింతవరకు విశ్వాతీతభావాన్ని సమర్ధించలేదు. అలాంటి పరిస్థిత్తుల్లో కాప్రాలాంటివారు విశ్వాన్ని నర్తిస్తున్నశక్తిగా వర్ణిస్తూ, నటరాజు శివునితోపోల్చి, 'అప్రాచ్యం'తో ప్రాచ్యాన్ని సమర్ధించేదాకపోయారు. ప్రాచ్యంలో హైందవాన్నీ, దాన్ని నిరాకరించిన బౌద్ధాన్నీ, వాటికి భిన్నమయిన టావోయిజాన్నీ పెనవేసి - ఆధునిక విజ్ఞానానికి అందని సత్యాన్ని (టోవోను) ప్రాచ్యులెన్నడో అందుకున్నారన్నాడు.

ఇలాంటివారి చలవవల్లనే సత్తు-చిత్తు "పురాణప్పుందు" అప్పుడప్పుడు చెలవేస్తున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్ర దార్శనికఫలాతాల వక్రీకరణను నిరోధించే ప్రయత్నాలు శాస్త్రజ్ఞులు ముమ్మురంగా సాగిస్తేతప్ప, సత్యమారర్గానికి జరుగుతున్న అపచారం ఆగదు.

"చిత్తు మాత్రమే వున్నది. సత్తు లేదు" అనేది అబద్ధం. ఉన్నది సత్తు ఒక్కటే. దాని పరిణామంలో ఒకానొక వ్యక్తీకరణమాత్రమే చిత్తు. ఇదీ సత్యం.

## అద్దంకిలో హేతువాద అధ్యయన తరగతులు

25-12-2007 తేదిన అద్దంకిలో ప్రకాశం జిల్లా హేతువాద సంఘం అధ్వర్యాన హేతువాద అధ్యయన తరగతులు జరిగాయి. ఈ అధ్యయన తరగతులలో భారత హేతువాద సంఘ అధ్యక్షులు కుర్రా హనుమంతరావు, అంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ప్రధానకార్యదర్శి మేదూరి సత్యనారాయణ, ప్రకాశం జిల్లా హేతువాద సంఘ అధ్యక్షులు నార్నె వెంకట సుబ్బయ్య నాస్తికకేంద్రం ప్రముఖులు డా॥ జి. విజయం పాల్గొన్నారు. ఈ అధ్యయన తరగతులను ప్రకాశం జిల్లా హేతువాద సంఘ ఉపాధ్యక్షులు వెంకటేశ్వర్లు నిర్వహించారు.

# ఆధునిక యుగం

- జి. వీరన్న

దాదాపు 40 లక్షల సంవత్సరాలకాలం కొనసాగిన మానవజాతి పరిణామం ఫలితంగా ఆధునిక మానవుడు ఆవిర్భవించినట్లు తెలుసుకున్నాం. ఆ పరిణామ చరిత్ర అంతా సుదీర్ఘమైన, అసాధారణమైన, అసంఖ్యాకమైన సంఘటనల సమాహారం. ప్రకృతిలో సంభవించిన అపూర్వమైన అద్భుతప్రక్రియ. అతిశీతోష్ణాలు, కరవులు, వరదలు, దావానలాలు, రోగాలు, క్రూరమృగాల వంటి ప్రకృతి వైపరీత్యాలను ఎదిరించి, జీవన పారాటాలను సాగించి మానవుడు భూమిమీద బతికి బట్టకట్టాడు.

ఈ సుదీర్ఘమైన, నిరంతరమైన, అవిశ్రాంత పోరాటంలో ఆకలి వంటి ప్రధానమైన సమస్యల పరిష్కారంలో అతనికి ఏ బాహ్య శక్తులు సహాయం లభించలేదు. ఏ అతీత శక్తులు, దివ్యశక్తులు అతడిని కాపాడలేదు. సర్వకాల సర్వావస్థలయందు అతనికి అండగా నిలచిందీ, సర్వసమస్యల పరిష్కారంలో అతనికి సహాయపడిందీ అతనిలో అంతర్గతంగావున్న హేతుత్వమే, వివేకమే.

వివేకవంతమైన మానవుడే తన వివేకానికి పదును పెట్టుకుంటూ అంచెలంచలుగా విజయాలను సాధించుకుంటూ తన జైత్రయాత్రను కొనసాగిస్తున్నాడు. పాతకాలపు రాతి పనిముట్ల తయారీతో ప్రారంభమైన అతని పరిజ్ఞానం పారిశ్రామిక విప్లవాలను, వ్యవసాయక విప్లవాలను సాధించింది. అపూర్వ, అనితర సాధ్యమైన గ్రహాంతరయానాల స్థాయికిచేరుకుంది. విజ్ఞాన కళారంగాల్లో మానవుడు సాధించిన ప్రగతి అతని వివేక ఫలితమే. మొత్తం మానవ పరిణామ కాలాన్ని ఒక గంట కాలానికి చూసినట్లయితే 59 నిమిషాలకాలం అతడు ఆదిమదశలో అరణ్యాల్లోఅనాగరికంగా గడిపి, చివరి నిమిషం కాలంలోనే అతడు తనవివేకానికి పదును పెట్టి విజ్ఞాన సంపన్నుడై అఖండ విజయాలను సాధించినట్లు శాస్త్రవేత్తలు అంచనా వేశారు. దీన్నిబట్టి ఆధునిక మానవుడు ఇటీవల కాలంవాడని తేలుతుంది.

క్రీ.పూ. నాలుగయిదువేల సంవత్సరాల నాడే ప్రపంచంలో మానవ నాగరికతలు వెలసి వికాసం చెందినట్లు చరిత్ర తెలుపుతుంది. ఈజిప్టు, బాబిలోనియా, మెసపటోమియా నాగరికతలు ఆ కాలంలోనే వున్నట్లు చరిత్ర పరిశోధకులు తెలుపుతున్నారు. వాటి తర్వాతి కాలంలో సుమారుగా క్రీ.పూ. 2300-1700 సంవత్సరాల మధ్య భారతదేశంలో ప్రాచీన సింధూ నాగరికత వున్నట్లు కూడా హరప్పా, మొహెంజోదోరాలలో బయటపడిన శిధిలాలు రుజువుచేస్తున్నాయి.

అదే విధంగా క్రీ.పూ. ఆరేడు శతాబ్దాల కాలంలో గ్రీకు దేశంలో తాత్విక చింతన ప్రారంభమైనట్లు, గ్రీకు తాత్వికుడైన థేల్స్ (క్రీ.పూ. 640-550) ప్రపంచంలోనే ప్రథమ దార్శకుడైనట్లు పరిగణింపబడుతున్నది. దీనికి సమాంతరముగా భారతదేశంలోనూ తాత్విక చింతన ఇంచుమించు అదే కాలంలో ప్రారంభమయినట్లు తెలుస్తున్నది. గ్రీసులోని డెమోక్రిటస్ అణువాదానికి, భారతదేశంలోని కణాదుని అణువాదానికి పోలికలు కూడా వున్నట్లు గమనించారు. అయితే అవి ఒకరిని చూసిమరొకరు కాపీ కొట్టినవి కాదని అవి రెండూ వారివారి స్వతంత్ర ప్రతిపాదనలేనని తేలింది.



28

గ్రీకు తాత్విక చింతనలోను, భారతీయ తాత్విక చింతనలోను భావవాద, భౌతికవాద ధోరణులు కనిపిస్తున్నా అవి ప్రధానంగా భౌతిక వాదానికి ప్రాధాన్యత నిచ్చేవిగా వున్నట్లు గమనించవచ్చు. భారతదేశంలో వేదాలలో కర్మకాండ, ఉపనిషత్తులలో బ్రహ్మం గురించిన భావవాద చింతనలున్నా వాటికి భిన్నంగా, వ్యతిరేకంగా చార్వాకం, బౌద్ధం, జైనం వంటి తాత్విక సిద్ధాంతాలు బయలుదేరడమే గాక, ఉద్యమ రూపాన్ని కూడా సంతరించుకున్నట్లు చారిత్రక ఆధారాలు చూపుతున్నాయి. అవన్నీ భౌతికవాదాన్ని సమర్థించేవే. అదేవిధంగా సాంఖ్య, వైశేషిక, న్యాయదర్శనాలలో కూడా భౌతికవాద ఛాయలు మెండుగా వున్నాయి.

ప్రాచీన భారతీయ తాత్వికచింతన ప్రధానంగా భౌతికవాదదిశగా నడిచినట్లు స్పష్టమైన ఆధారాలున్నప్పటికీ ప్రాచీన భారతీయ తాత్వికచింతన సర్వస్వం ఆధ్యాత్మిక వాదపరంగా, భావవాద దిశగా నిడిచినట్లుగా పెద్ద ఎత్తున ప్రచారం జరుగుతోంది. ప్రచారాలవల్ల అసత్యాలు సత్యాలు కాలేవు. ఏదిఏమైనా ఎంతో జిజ్ఞాసతో కొనసాగిన ప్రాచీన భారతీయ చింతనాయుగాన్ని 'జిజ్ఞాస యుగం'గా పరిగణించడానికి ఎవ్వరికీ అభ్యంతరాలుండవనేది నిజం.

ఉపనిషత్తుల కాలం నుండి ఎంతోజిజ్ఞాసతో కొనసాగిన భారతీయ తాత్వికచింతన క్రీస్తుశకారంభం నాటికి ఆవిరైపోయి అంతర్ధానమయింది. అప్పటినుండి సూత్రయుగం, సూత్రభాష్యయుగం, అనువాదయుగం, వ్యాఖ్యానయుగం ప్రారంభమైంది.

భగవద్గీతలో పేర్కొన్న వర్ణవ్యవస్థ క్రమంగా అనేకకులాలుగా చీలి కులవ్యవస్థ సమాజంలో నిలదొక్కుకుంది. కులవ్యవస్థ యొక్క వికృత రూపంగా హిందూమతం 'అస్పృశ్యులు' అనే ఒక వర్గాన్ని సృష్టించింది. మనుషులను అంటరానివారిగా భావించి వారిపట్ల క్రూరంగా, నీచంగా, అమానుషంగా ప్రవర్తించింది. మనుషులను జంతువులకన్నా హీనంగా ప్రాణంలేని వస్తువులకన్నా నీచంగా భావించడం కులవ్యవస్థలోని దుర్మార్గానికి దౌష్ట్యానికి పరాకాష్ఠగా నిలచింది.

పురాణాలు, ఇతిహాసాలు, స్మృతులు బయలుదేరి అనాచారాలకు, దురాచారాలకు ఆహ్వానం పలికాయి. పునర్జన్మ సిద్దాంతం, కర్మసిద్ధాంతం, పరలోక సిద్ధాంతం వంటివి బయలుదేరి అసత్యపు పునాదులపై సమాజాన్ని నడిపించసాగాయి. జన్మరాహిత్యమే మోక్షమని, అదే అందరి జీవితాలకు ఆదర్శమని ప్రచారం జరిగింది. దానిలో పారలౌకిక జీవితానికి ప్రాధ్యాన్యత పెరిగి ఈ లోకంలోని మనుషుల బ్రతుకులకు విలువలేకుండాపోయింది.

భారతదేశానికి సంబంధించినంతవరకు ప్రాచీన జిజ్ఞాస యుగం తరువాత తాత్విక చింతన తిరోగమించింది, వెనక్కి నడిచింది. స్పష్టత నుంచి మార్మికతవైపు, భౌతికత నుంచి అభౌతికత, ఆధ్యాత్మికతలవైపు, సమతనుంచి అసమతవైపు, ఈలోకం నుంచి పరలోకం వైపు భావగమనం నడిచింది. .

దీనికి భిన్నంగా ఐరోపా తత్వ శాస్త్రచరిత్రలో భావ గమనం క్రమాధికంగా స్పష్టత, భౌతికత, సత్యం, జ్ఞానం, సమత, భౌతికతల వైపు నడిచింది. గ్రీకులకాలం నుంచి రినైజాన్స్ కాలం వరకు, ఆ తరువాత వచ్చిన వికాసయుగం, హేతువాదయుగం, భౌతికవాదయుగం దాకా అనేకమంది దార్శనికులు శాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు, ఆర్థికవేత్తలు ఒకరి తర్వాత ఒకరు

నూతనాంశాలను కనుగొని పూర్వమున్న స్థితులకంటె ఉన్నతంగా, సంపన్నంగా వుండే విధంగా అభివృద్ధి చేస్తూవచ్చాడు. అక్కడక్కడ ఎగుడుదిగుళ్లున్నా వారి గమనమంతా పైపైకి వెళ్ళే సోపాన పరంపరంగా వున్నట్లు గమనించవచ్చు.

భారతదేశంలో ఈ పరిస్థితి ఐరోపా పరిస్థితికి పూర్తిగా భిన్నంగా, వ్యతిరేకంగా వున్నట్లు మనం చూడవచ్చు. ఉపనిషత్తుల తర్వాత పుక్కిటి పురాణాలు, సమతావాదం తర్వాత వర్ణవ్యత్యాసాలు, భౌతిక వాదం తరువాత భక్తి ఉద్యమాలు బయలుదేరాయి. వాటికి ముందున్న పురోగమన రీతులు క్రమంగా అంతర్ధానమైపోగా తిరోగమనరీతులు సమాజంలో స్థిరపడిపోయాయి. ఇటువంటి విషయ పరిణామానికి కారణాలను విదేశీ దండయాత్రలకు, విదేశీ పాలనకు అంటగట్టలేము. బౌద్ధజైనాది భావోద్యమాల మీద హైందవం దాడి చేసి వాటిని నిర్మూలించడంలో విజయం సాధించడమే దీనికి కారణమనేది స్పష్టం.

పైకారణాలవల్ల భారతదేశాన్ని అంధకారంలోకి నెట్టివేసిన మధ్యయుగాన్ని అంధకారయుగంగా పరిగణించడం జరుగుతున్నది. క్రీస్తు శకారంభంతో ప్రారంభమైన అంధకారయుగం సుదీర్ఘంగా కొనసాగి 18వ శతాబ్దాంతంలో అంతమైంది.

ప్రపంచంలోని ఇతర దేశాలలో కూడా క్రీస్తుశకం రెండుమూడు దశాబ్దాల తరువా మౌలిక తాత్విక జిజ్ఞాసక్షీణించి అంధకారయుగం రాజ్యమేలుతుంది. సుమారు వెయ్యి సంవత్సరాలకు పైగానే ఈ అంధకారయుగం ప్రపంచమంతటా కొనసాగింది. ఐరోపాలో క్రీ.శ. 15,16 శతాబ్దాలలో రినైజాన్స్ ఉద్యమం కొనసాగి అంధకారయుగాన్ని తత్తునియలు చేసి అంతమొందించింది.

**ఐరోపా రినైజాన్స్**

గ్రీసులో నగరరాజ్యాలు City States అంతరించాయి. ఐరోపాలో క్రైస్తవం వ్యాపించి బలపడింది. తురుష్కులకు క్రైస్తవులకు మధ్య అనేక సంవత్సరాలు యుద్ధాలు జరిగాయి. ఆ కాలంలోనే గ్రీకు వైజ్ఞానిక సాహిత్యం అరబ్బు దేశాలకు చేరింది. అక్కడ శాస్త్రీయ తాత్విక చర్చలకు తోడ్పడింది. క్రైసవ ముస్లిం యుద్ధాలు క్రీ.శ. 1453లో ఐరోపాలో అంతమైనాయి.

ప్రాచీన గ్రీకు విజ్ఞానమే ఐరోపాలో వ్యాపించి జిజ్ఞాసను రేకెత్తించింది. క్రైస్తవ మత ప్రాతిపదికలకు బిన్నంగా సత్యమున్నదనే విషయాన్ని జిజ్ఞాసువుల ముందించింది. గ్రీకు విజ్ఞానం ఆగిపోయిన చోటునుండి వారు ముందడుగు చేశారు. ఇది అదివరకే ఆగిపోయివున్న విజ్ఞానాన్ని పునరుద్ధరించడం కాదు. ఆగిపోయిన విజ్ఞాన వికాసాన్ని కొనసాగించటమన్నమాట. అందుకే దానిని రినైజాన్స్ అన్నారు. రినైజాన్స్ అంటే పునర్వికాసమని అర్థం.

రినైజాన్స్ అంటే పునరుద్ధరణ (రెస్టోరేషన్) కాదు. సంస్కరణ (రిఫార్మేషన్) కాదు. పునరుజ్జీవనం (రివైవలిజం) కాదు. ఒకప్పుడు ప్రపంచంలో అనేక దేశాల్లో అడ్డంకులు లేకుండా సాగిన స్వేచ్ఛా జిజ్ఞాసను తిరిగి కొనసాగించడం. దానికి అడ్డుతగిలే అడ్డంకులను అధిగమించడం రినైజాన్స్.

ఐరోపాలో క్రైస్తవ మత భావాల నియంతృత్వంలో కూరుకుపోయి అణగిమణిగివున్న మేధావులు గ్రీకు విజ్ఞానంతో ప్రేరణపొంది భావనియంతృత్వాన్ని ఎదిరించి పోరాడటానికి



30

సిద్ధమయ్యారు. భావస్వాతంత్ర్యమనే స్వేచ్ఛా బావుటాను ఎగురవేశారు. పోరాటంలో ఎదురయ్యే సమస్యలకు భయపడలేదు. త్యాగాలకు వెనకడుగులేయలేదు. అనేక రంగాల్లో సృజనాత్మక విలువలకోసం కృషి చేవారు. ఆ కృషి ఫలితంగానే భావవిప్లవమనే మహోద్యమం బయలుదేరి తరాతరాల భావదాస్యాన్ని, నియంతృత్వ పోకడలను నిర్మూలించింది. బానిస శృంఖలాలను ఛేదించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పట్టం కట్టింది. వెయ్యి సంవత్సరాలకు పైగా కొనసాగిన అంధకారాన్ని తొలిగించింది. వెలుగులను నింపింది. మానవ అస్తిత్వసారాన్ని కాపాడి నిలబెట్టింది.

కోపర్నికస్ (క్రీ.శ. 1473-1543) విజ్ఞాన శాస్త్రంలో విప్లవకరమైన సూర్య కేంద్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దానికి ముందు భూమి విశ్వానికి కేంద్రమని, మనుషులు కోసమే దేవుడు భూమిని సృష్టించాడని, సూర్యచంద్ర నక్షత్రాదులను సృష్టించాడని నమ్మేవారు. సూర్యకేంద్ర సిద్ధాంతంలో ఈ నమ్మకానికి విఘాతం కలిగింది. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతుందనే. సత్యాన్ని మతస్తులు జీర్ణించుకోలేకపోయారు. సూర్యుని నిలబెట్టి భూమిని దానిచుట్టూ తిప్పుతున్న నీచులను బంధించి, శిక్షించమని మతస్తులు గగ్గోలు పెట్టారు. దాని ప్రకారం కోపర్నికస్, గెలీలియో, బ్రూనో వంటి శాస్త్రజ్ఞులను వారి మతవ్యతిరేక భావాలను సహించలేక శిక్షలు విధించి, చిత్రహింసలు పెట్టారు. బ్రూనోను (1550 - 1600) 1600 సంవత్సరంలో సజీవంగా దహనం చేశారు. ఇలా ఎందరో శాస్త్రవేత్తలు మత మౌఢ్యానికి బలయ్యారు.

విజ్ఞాన శాస్త్రానికి మతానికి యుద్ధం ఆనాటి నుండే ప్రారంభమైంది. కోపర్నికస్ సూర్యకేంద్ర సిద్ధాంత ప్రతిపాదనతోనే విజ్ఞాన రంగంలో ఆధునిక యుగం ప్రారంభమైనట్లు పరిగణిస్తారు.

మార్టిన్ లూథర్ పోప్ సార్వభౌమత్వంపై తిరుగుబాటు చేశాడు. అనాదిగావస్తున్న మతవిశ్వాసాలకు, ఆచారాలను అనేకులు ప్రశ్నించడం ప్రారంభించినారు. మధ్యయుగాల పిడివాదంపై తిరుగుబావుటాగా ప్రారంభమైన రినైజాన్స్ఉద్యమాన్ని మేధావులు దేవుడిపై మానవుడి తిరుగుబాటుగా వర్ణించారు. మానవుడు తన శక్తికి తానే మూలమని, తనను దైవ సంకల్పం నడపడంలేదని, తన భవిష్యత్తుకు తానే కర్తననే భావాలు రినైజాన్స్ ఉద్యమాన్ని ప్రభావితం చేశాయి. 15,16 శతాబ్దాలలో దీర్ఘకాలంగా రినైజాన్స్ ఉద్యమం కొనసాగి అభివృద్ధి చెంది. అభివృద్ధి సాధించింది.

రినైజాన్స్ ఉద్యమం మౌలికంగా మానవుడిమానసిక స్వేచ్ఛా ఉద్యమమైనందువల్ల అది మూడు గొప్ప ఫలితాలను సాధించింది.

రాజు దైవాంశ సంభూతుడనే భావాన్ని తుక్కుతునకలు చేసింది. ఫ్రెంచి మహా విప్లవాన్ని ప్రభావితం చేసింది. ఐరోపాలో అనేక దేశాల్లో ప్రజాస్వామ్య వ్యవస్థా స్థాపనకు నాందిపలికింది. ఇవన్నీ మొదట దశలోని ఫలితాలు.

రినైజాన్స్ సృష్టించిన స్వేచ్ఛా వాతావరణం అపూర్వమైన శాస్త్రాభివృద్ధికి దారితీసింది. తత్ఫలితంగా అంతకు పూర్వం లక్షల సంవత్సరాల కాలంలో మానవ జాతి మొత్తం సంపాదించుకున్న జ్ఞానం కంటె ఉన్నతమైన జ్ఞానాన్ని వేగంగా సంపాదించుకోవడానికి వీలుకలిగింది. ఇవి రెండవ దశలోని ఫలితాలు.

మూడవదశలో పెరిగిన శాస్త్రం, దాని వెనుక దాగిన శాస్త్రీయతత్వం 18,19 శతాబ్దంలోని పారిశ్రామిక విప్లవానికి బాటలు వేశాయి. సాంకేతిక రంగం అభివృద్ధి చెంది రెండవ పారిశ్రామిక విప్లవాన్ని నేడు చూడగల్గుతున్నాం. తత్ఫలితంగా మానవ శ్రమశక్తి అనేకరెట్లు పెరిగింది.

కారణాంతరాలవల్ల ఐరోపాలో సంభవించిన రినైజాన్స్ వంటి పునర్వికాసోద్యమం భారతదేశంలో పుట్టనేలేదు. రాజుల, చక్రవర్తుల నియంతృత్వ పాలనను అంతమొందించడానికి ఇక్కడ ప్రజాస్వామ్యం అంతరించలేదు. అజ్ఞాన పూరితమైన స్తబ్దజీవితాన్ని కదిలించగల శాస్త్రీయ పరిశోధన లేవీ ఇక్కడ జరుగలేదు. పారిశ్రామిక విప్లవం జరుగలేదు. ఉత్తరాదినుండి ముస్లిందండయాత్రలు జరిగాయి. తరువాత వారు భారతదేశాన్ని ఆక్రమించుకొని కొల్లగొట్టారు. వారి తరువాత బ్రిటిష్ వారు ఆక్రమించుకొని విదేశీపాలనను సుస్థిరం చేయడం ఆశ్చర్యం కాదు.

వాస్తవంగా భారతదేశం అభివృద్ధి సాధించి ఉంటే ఆరువేల మైళ్ళ దూరం నుండి చెక్కపడవల్లో వచ్చిన కొద్ది మంది వ్యాపారస్తులు ఈ దేశాన్ని అంత సులభంగా జయించివుండేవారుకాదు. ఆనాడు దేశంలో నిరంకుశత్వం, అన్యాయం, అరాచకత్వం ఇక్కడ ప్రబలివున్నందువల్లనే భారతీయులు ఆంగ్లేయులకు స్వాగతం పలికారు.

పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా క్రీ.శ. 1497 జులై 8వ తేదీన లిస్బన్‌లో బయలుదేరి, ఆఫ్రికా దక్షిణాన కేఫ్ ఆఫ్ గుడ్‌హోప్‌ను చుట్టి కీ.శ. 1498 జూన్ 17వ తేదీన ఇండియా పడమర తీరంలోని కాలికట్‌ను చేరాడు. దీనిలో అట్లాంటిక్, హిందూ మహాసముద్రాల మీదగా భారతదేశానికి పాశ్చాత్యుల రాకపోకలు సులభయ్యాయి.

పోర్చుగీసువారి తరువాత క్రమంగా డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు ఇండియాతో వర్తక వాణిజ్యాలు కొనసాగించారు. వాణిజ్య భద్రతా నెపంతో సైనిక బలగాలను సమకూర్చుకొన్నారు. స్థానిక రాజుల వ్యవహారాలలో తలదూర్చి వారి మధ్య తగువులు తీర్చేనెపంతో ఒక్కొకసారి ఒక్కొక్క రాజుకు మద్దతును ప్రకటిస్తూ మెల్లగా ఆ రాజ్యాలనే కబళించ సాగారు. ఆ క్రమంలో అందరికన్నా నౌకాబలంలో ఆధిపత్యాన్ని కలిగివున్న ఆంగ్లేయులు మిగిలిన ఐరోపా జాతివారిని ఓడించి భారతదేశంపై తిరుగులేని విధంగా పట్టును సాధించారు. ఈ విధంగా ఇంగ్లీషు వారు తూర్పు ఇండియా కంపెనీ ప్రత్యక్షపాలన ప్రారంభమైంది. 1757లో ప్లాసీయుద్ధంలో బెంగాల్ నవాబు సిరాజుద్దౌలాను ఓడించి ఇంగ్లీషు సైన్యం విజయం సాధించడంతో ఇండియాలో ఇంగ్లీషువారి పాలన స్థిరపడింది. భారతీయ నాగరికతపై పాశ్చాత్య నాగరికతా ప్రభావం ప్రారంభమై అనేక సంఘ సంస్కరణలకు ద్వారాలు తెరచింది.

ఇంగ్లీషువారు ఈ దేశంలోని స్థానిక సరిస్థితులను, ఆచార వ్యవహారాలను క్షుణ్ణంగా పరిశీలించి, వాటి కనుగుణంగా తమ నూతన పరిపాలనా విధానాన్ని ప్రవేశపెట్టారు. విభజించి పాలించు అనే రాజకీయ నీతిని అమలు పరిచారు. వినూత్న యుద్ధతంత్రాలతో, కుట్రలతో, మాయోపాయాలతో స్థానిక రాజులను జయించి, తమ పాలనాపరిధిని విస్తరించుకుంటూ వచ్చారు. అమానుషంగా ప్రవర్తించి దేశ సంపదను కొల్లగొట్టి తమ దేశానికి తరలించారు. ఈ చర్యలన్నీ ఖండించదగినవే. ఇందులో సందేహం లేదు.



32

అయితే వాటన్నింటికీ భిన్నంగా, వారు మరో రకంగా మన దేశానికి మహోపకారం చేసిన వారయ్యారు. ఉదారవాదులు, విజ్ఞానవంతులైన ఆంగ్లేయులు మన దేశంలో అనేకమైన న్యాయ చట్టాలను, శాసనాలను ప్రవేశపెట్టారు. తమ పరిపాలనా సౌలభ్యం కోసం తమ అధికారాన్ని చెలాయించడంకోసం దేశం నలుమూలల్లో రోడ్లు, రైలు మార్గాలను నిర్మించారు. తంతి తపాల సౌకర్యాలను ఏర్పాటుచేశారు. అనేక చిన్న పెద్ద పరిశ్రమలను స్థాపించి యంత్ర నాగరితను ప్రవేశపెట్టారు. విటన్నిటికంటె ముఖ్యంగా ఇంగ్లీషు విద్యను బోధించే పాఠశాలలు, కళాశాలు, విశ్వ విద్యాలయాలు స్థాపించారు. నూతనమైన ఇటువంటి పరిణామాలతో శతాబ్దాలుగా స్తబ్దంగా వుండిపోయిన భారతీయుల సమాజంలో చలనం ప్రారంభమైంది.

అనేక శతాబ్దాలుగా భారతదేశంతో ఎంతోమంది విదేశీయుల పాలన క్రింద వుంది. పారశీకులు, యవనులు, శకులు, కుషాణులు, హుణులు, మహమ్మదీయులు, మంగోలులు, మొఘలులు మొదలైన విజాతీయులు పాలన క్రింద వున్నపటికి భారతీయ సమాజంలో సమూలమైన మార్పులు చోటుచేసుకోలేదు. సాంఘిక, సాంస్కృతిక రంగాలలో విశేషమైన మార్పులు సంభవించలేదు.

ఆంగ్లేయుల సంస్కృతి ఐరోపా సంస్కృతి. అది ఆసియా దేశాల సంస్కృతికి పూర్తిగా భిన్నమైనది. అది ఇంగ్లీషు విద్య ద్వారా నూతనమైన ఆలోచనా ధోరణులకు నాంది పలికింది. దానితో శతాబ్దాలుగా ప్రశ్నించడానికి వీలులేనివిగా భావించిన మత విశ్వాసాలను, సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను ప్రశ్నించడం, ధిక్కరించడం ప్రారంభమైంది.

దేన్నయినా సరే గుడ్డిగా విశ్వసించరాదని, ప్రతిదాన్ని క్షుణ్ణంగా పరిశోధించి నిజానిజాలు నిగ్గుతేల్చుకోవాలనే ధోరణి ఆనాటి యువకులను ఆకర్షించింది. అది క్రమంగా హిందూ సమాజంలోని అనేక అసమానతలను, అనాచారాలను, దురాచారాలను ప్రశ్నించి, తిరస్కరించడానికి దోహదం చేసింది. కులవ్యవస్థలోని అసమానతలు, అస్పృశ్యత బాల్యవివాహాలు, సతీసహగమనం వంటి దురాచారాలపై పోరాటాలు జరపడానికి పునాదులు నిర్మించింది.

## చేతన, శ్రావణ్ కుమార్‌ల వివాహం

తెనాలి హేతువాద ప్రముఖులు గురిజాల సీతారామయ్యగారి మనుమరాలు, సి.ఎల్.న్.గాంధీ, రాధారాణి గార్ల కుమార్తె ఆర్.జి.చేతన వివాహం హైదరాబాదు వాస్తవ్యులు కె.ఎస్. రమేష్ , సూర్యకళ గార్ల కుమారుడు కె.శ్రావణ్ కుమార్‌తో 30 నవంబరు 2007 తేదిన హైదరాబాదులో జరిగిన సందర్భాన "హేతువాది"కి సమర్పించిన విరాళాలు

| | | | |
|---|---|---|---|
| 1. | గురిజాల సీతారామయ్య | రు. | 10,000/- |
| 2. | సి.ఎల్.ఎన్. గాంధీ | | 10,000/- |
| 3. | గురిజాల యం.ఎన్. రాయ్ | | 5,000/- |

# విజ్ఞాన ప్రవాహంలోని గుంట చిక్కులు.

-రావిపూడి

The progress of civilisation is not wholly a Uniform drift towards better things.

- Prof . A.N. whitehead.

మానవ విజ్ఞాన చరిత్రనంతా ఒక్కచోట సమీకరించి, ఒక్కసారి సమీక్ష చేసి సింహావలోకనం చేస్తే, నానాటికీ మానవుడు ముందుకే నడుస్తున్నట్లు స్పష్టమవుతుంది. అయితే, ఈ పురోగమనం ఒకే హైరోడ్డు మీద కాదు, గొగ్గి గొగ్గిలిగా వున్న గులక రాళ్ల బాటమీద. ఒకప్పుడు ఉన్నత విజ్ఞాన శిఖరాల్ని అందుకొని, మరొకప్పుడు అగాధమైన లోయల్ని ఆశ్రయించి, ఇంకొకప్పుడు అయోమయంగా, దరీపరీలేని మహా సముద్రాల్నే మానవుడు ఈదాడు. ఈబాట ఎంత అపసవ్యంగా వుందో కష్టాలు కూడా అంతగా అతనెదుర్కోవలసి వచ్చింది. మృగ దశను దాటి, నాలుగు కాళ్లలో రెండిటిని చేతులుగా మార్చుకొని, వెలుగుకోసం పరితపించి, తడవులాడి, ప్రాకులాడి, పోరాడి, నానా గందరగోళంచెంది, మాతాధి పతులను మనస్సునూ- భూపతులకు దేహాన్నీ స్వాధీనం చేసి, విముక్తి కోసం, వ్యక్తిత్వంకోసం జీవితాన్నొక యుద్ధరంగం చేసుకొని క్రింద మీదులు పడుతున్నాడు. కాని, అంత అపసవ్యమైన బాటలోనూ పల్లం నుంచి మెరకకే విజ్ఞాన వాహిని యెక్కుతూ వచ్చింది. అంతటి కష్ట భరితమైన మార్గంలో కూడా కష్టం నుంచి సుఖానికే మానవుడు పయనిస్తున్నాడు.

జీవ పరిణామ దశలో "ఆలోచన" మానవుడుడిలో కలిగినప్పటి నుంచి ప్రత్యక్షమవుతున్న అనంత ప్రకృతిలో ప్రతి వస్తువును గురించీ "ఏదీ యేమిటి?" అని ప్రశ్నించు కొన్నపుడల్లా హేతువాదం చిందుతూనే వచ్చింది. తత్ఫలితంగా హేతు బద్ధంగా తన విశ్వాన్ని పరిశీలించి, పరీక్షించి, నిర్వచించడానికి మానవుడు ప్రయత్నిస్తూనే వచ్చాడు. పాత అనుమానాల్ని తీర్చుకుంటూ, కొత్త అనువానాల్ని తెచ్చుకొంటూ, అనంతవిశ్వం 'అంతు' కనుగోడానికి తాపత్రయపడపతూ, అనంత విజ్ఞాన ప్రపంచాన్ని అయోమయంగా వ్యాప్తి చేస్తూనే వున్నాడు. కాని, ఆయా సమయాంతరాల్లో పురోభివృద్ధి దాయకమైన వైజ్ఞానిక భావనల్ని వెలిబుచ్చిన మహాధీమంతులైన తత్వశాస్త్రజ్ఞులను మిథ్యా భావనలతో తత్వ శాస్త్రజ్ఞులే తాత్కాలికంగా యెదురీది జయించారు. అంత మాత్రాన సత్యమైన, నిత్యమైన విజ్ఞాన జ్యోతి ఆరిపోయిందనుకోరాదు. ఆ దశలో మానవజాతి విజ్ఞానం అగాధమైన అఖాతాన్ని ఆశ్రయించి మరుగున పడిందన్నమాట. కాలగర్భంలో మరుగున పడ్డ ఆ సత్యాన్ని బయటకు తీయడానికి మరొక వ్యక్తి ఉద్భవించి, విజ్ఞాన వీచికల చుట్టూ ఆవరించి వున్న చీకటి మబ్బుల్ని చెదర గొట్టడానికి యత్నించి కృతకృత్యుడవతాడు. ఆ మబ్బులనే దట్టం చేయడానికి కొన్ని సాంఘిక శక్తులు యత్నించకపోరు. కాకపోతే, వారు చేయగలిగేదొక్కటే వుంది. ప్రకృతికాధీనంకాక, అధీనం కాని ప్రకృతినే దిగమింగి తనకు బానిసగా చేసుకోవడానికి మానవుడు సాగిస్తున్న విజ్ఞాన స్వాతంత్ర్య పోరాటానికి మిట్ట పల్లాలు సృష్టిస్తారు. అంతే! సత్యాన్వేషణకెప్పుడూ సరళత్వంలేదు. సరళత్వం లేకపోవడమే ఆ మార్గ విశిష్టతగా తోస్తుంది. తప్పుచేయడం, చేసిన తప్పును సవరించుకోవడం – ఇదే మానవుడి



34

ఉద్యోగం, మానవ చరిత్రగూడాను. ఆ సత్యాన్ని మనం గమనించగలిగితే, మానవ జీవిత రహస్యాన్ని మనం తెలుసుకోగలిగినట్లే. అప్పుడే మానవుడి విజ్ఞాన తత్వంలో వున్న ఏకత్వాన్ని మనం అర్ధం చేసుకోగలుగుతాం.

ఈనాటి వైజ్ఞానిక ప్రపంచంలో యెంతో వెనకబడివున్న దేశాలు ఒకప్పుడు, వేల సంవత్సరాల క్రితం అనన్య ప్రజ్ఞతో, విజ్ఞాన వికాసంతో విలసిల్లాయి. ఒకనాడు అటవీనాగరికతలో ఊదుతూ, పచ్చి మాంసం భక్షించడం కంటె తెలియని జాతులు ఈనాడు విజ్ఞాన రంగంలో అసామాన్య ప్రతిభను సంపాదించాయి. పాత కాలాలనాడు విజ్ఞానానికి ఆయువు పట్లయిన చైనా, ఈజిప్టు, ఇండియా, గ్రీసు దేశాలు ఈనాటి విజ్ఞానంలో, శాస్త్ర రంగంలో పేరుమాసి మారుమూలల్లో ముడుచుకొని వుంటే, నాలుగైదు వందల యేళ్ల క్రితం గోచీపెట్టుకోవడానికి గుడ్డ పేలికలు లేక, ఆకులు కట్టుకున్న జాతులు పరమాణు శక్తిని పట్టుకొని ప్రపంచంతో దాగుడు మూతలాడుతున్నాయి. అంటే, విజ్ఞానం ఏ ఒక్కరి గుత్తకూ స్వాధీనం కాని మనోవ్యాపారమన్న మాట!

"మానవజాతి వైజ్ఞానిక విభజన భౌగోళిక విభజన మీద కానీ, జాతి విభజన మీద ఆధారపడి లేదు. శాస్త్రాన్ని అర్ధం చేసుకొని ఆచరణలో పెట్టే వారిలో వుంది." అన్నాడు జార్జి సార్టన్. కాబట్టి, వివిధ కాలాల్లో, వివిధ దేశాల్లో విజ్ఞాన వాహిని ప్రవహిస్తూవుండడం, లేకపోవడం అనేది విజ్ఞానాన్ని అర్ధంచేసుకొని అలవాటు చేసుకోవడానికి వ్యక్తులకున్న ఆసక్తి మీద ఆధారపడి వుంటుంది.

ఈనాటి పాశ్చాత్యవిజ్ఞానానికి మూలవిరాట్టు గ్రీకు విజ్ఞాన మంటున్నాం. అంటే, గ్రీకులు కూడా ఒకేసారి విజ్ఞానానికి పునాదులు వేశారనిగానీ, వారు విజ్ఞానంలో మరెవ్వరికీ వారసులు కారనిగానీ ఏ చరిత్ర కారుడూ అభిప్రాయపడలేదు. కాని, గ్రీకులు స్వతంత్రంగా అభివృద్ధి చేసింది చాలవుంది. మనకు దొరికిన చారిత్రకాంశాల్ని బట్టి గ్రీకుల నుంచి పాశ్చాత్యులకు విజ్ఞానమెలా ప్రసరించిందో వివరించగలం కానీ, గ్రీకులకు మరొకరి నుంచి విజ్ఞానమెలా ప్రసరించిందో వివరంగా చెప్పలేం. ఇదే, అన్ని శాస్త్రాలతోపాటు ఖగోళశాస్త్రంలోనూ మనకు కనిపిస్తుంది. గ్రీకులు విజ్ఞాన రంగంలో చాల ఆలస్యంగాదిగారు. ఎంత ఆలస్యంగాదిగారో అంత త్వరగా దాన్ని విడిచి వెళ్లారు. క్రీ.పూ. 600 నుంచే ఖగోళ శాస్త్రం ఎడతెరిపి లేకుండా వికసించితే, అంతకూ పూర్వం 2000 సంవత్సరాల నాడే గ్రీకులారంభించిన చోట వున్నారు చైనావారు. చైనాయుల కంటే ప్రాచీన తరమైన విజ్ఞానం ప్రపంచంలో మరే దేశంలోనూ కనపడదు. ఇటీవలి పరిశోధనల వల్ల బయటపడ్డ మహెంజోదారో, హరప్పా నగరాలు భారతీయ విజ్ఞానాన్ని ఇంకా 2000 యేళ్ల పూర్వానికి తీసుకుపోతున్నది. కాని, ఆరువేల యేళ్లనాటి భారతీయులకునఖగోళ విజ్ఞానాన్ని ఇదమిద్ధమని నిర్ణయాలు చేయడానికి ఆధారాలులేవు. ఏవిధమైన చరిత్రలు కానీ, శిధిలమై భూగర్భంలో దాగుకొని జీర్ణావశిష్టంగా వున్న ఆ నగరాలుకానీ చైనీయుల కంటె ప్రాచీన తరమైన భారతీయ ఖగోళ విజ్ఞానాన్ని గురించి చాటడం లేదు. కాబట్టి, మనకులభ్యమయ్యే కధనాన్ని బట్టి, ఖగోళవిజ్ఞానాన్నే ప్రాచీన తరంగా తీసుకోవచ్చు

(రావిపూడిగారి "విశ్వాన్వేషణ" గ్రంథం నుంచి-రచనాకాలం 1946).



35

# బ్రతుకు నినాదాలు

-కుర్రా హనుమంతరావు

మానవ జీవన వైఖరి, అభ్యున్నతి, జీవిత ధ్యేయాల పట్ల ఆయా కాలాలలో, నాటి వారి స్థాయిని, అవగాహనను బట్టి అనేక భావనలు ఉద్భవించాయి. అవే నినాదాలుగానూ ప్రసిద్ధి చెందాయి. అవన్నీ ఆయా కాలాల సమాజవర్తన తీరుకు చారిత్రకనిదర్శనాలు. మానవ హుందాతనానికి కొలమానాలు. తను ఆర్జించిన జ్ఞానస్థాయిని బట్టి 'బ్రతుకు నినాదాల'లో మార్పులు చేసుకోవటం తథ్యమనే విషయం చారిత్రక వాస్తవం, సమాజగతికి నిదర్శనం.

'సంతోషదాయక సంపూర్ణ జీవితమే' మానవజీవిత ధ్యేయం. నేటివరకు అందిన శాస్త్రవిజ్ఞాన తాత్వికధోరణుల నేపధ్యంలో దీనికి మించిన అభ్యుదయకర జీవన నినాదమేదీ నేటికి రూపొందలేదు. ఆధునికతను హుందాను, వ్యక్తిత్వాన్ని వ్యక్తీకరించే చక్కటి నినాదం. మానవవాదానికి సంకేతం. భౌతికవాస్తవానికి ప్రతిధ్వని.

ఇంకా ముందుకెళితే మనిషి ఏందుకు పుట్టాడో, బ్రతుకు సాగిస్తున్నాడో,-ఎలా బ్రతకాలో-ఏమి సాధించాలో వివరించే పరస్పర విరుద్ధ అంశాలలో నిండిన కాల్పనిక నినాదాలు మనిషి జీవితాన్ని ముంచి వేశాయి. 'జీవితం బుద్బుదప్రాయం'- 'మానవజన్మ పాపపంకిలం'- 'జ్ఞానం అజ్ఞానం'- 'పూర్వ జన్మ' - 'జ్ఞానం మోక్షం' వంటి నినాదాలు మనిషిని పదాధీనుని, నిమిత్తంమాత్రుని చేసి అతని హోదాను కించపరిచాయి. మన జీవితం మనకోసం కాదు, మనం చేయవలసింది ఏమీలేదు, ఏవడో ఆడించినట్లు ఆడాలనే ధోరణిలో సాగి చివరకు ఈ జీవితమే వ్యర్థమనే ప్రమాదకర మానసికస్థితిని కల్పించి మనిషిని అశక్తునిగాను, పరాధీనునిగాను, చేవలేని వానిగాను మార్చాయి. మనిషి ఆలోచనా పరిపక్వత తక్కువగా ఉన్నప్పుడు కొన్ని కొన్ని నినాదాలు మానవ వైఖరిని మూకుమ్మడిగా ప్రభావితం చేస్తాయనటంలో ఏలాంటి సందేహం అవసరంలేదు. అవే మత ధర్మాలు.

'చావటమే జీవిత ధ్యేయం'- ఓనాటి నినాదం కాగా ,నేటిది 'బ్రతకటమే జీవితధ్యేయం'. సకల జీవులు వాంచించేది బ్రతుకునే. పశుపక్ష్యాదులతో సహా జీవులన్నీ బ్రతుకుతూనే వున్నాయి. ఆకలి దప్పులు, జీర్ణక్రియ, శారీరకవాంఛలు మానవులతో సహా జీవులన్నింటిలో సమానమే. నిర్మాణవైరుధ్యం ద్వారా సంక్రమించిన ఆలోచనా వైరుధ్యమే మనిషిని ఇతర జీవజాలం నుండి వేరుచేసి మనిషిని ఉన్నతజీవిగా మార్చాయి. అందుకే కేవలం నిద్రాహారమైధునాలు మనిషి అహాన్నీ సంతృప్తి పంచలేవు. హేతుత్వం, వివేకం వంటి మానవజీవన పరిణామక్రమంలో సంక్రమించిన ఆవశ్యక లక్షణ ప్రభావం మనిషిని పశుపక్ష్యాదుల స్థాయిలో సంతృప్తి చెందనీయక నిరంతరం ఆశాజీవిని, తృష్ణనురగిలించింది. అదే మనిషికి-జంతువుకు మధ్య వ్యత్యాసం.

బ్రతుకుతున్నా మనటానికి బ్రతకటమొక్కటే ప్రమాణం కాదు. ఏ స్థాయిలో బ్రతుకుతున్నామనేదే ప్రధానం. మనిషి మనిషి స్థాయిలో బ్రతకాలిగాని పశుపక్ష్యాదుల స్థాయిలో కానే కాదు. అతని జీవనస్థాయిని నిర్ధారించేది అతని స్వేచ్ఛాసంకల్పాల స్థాయే. ఆస్థాయిని నిర్ధారించేది మనిషి జ్ఞాన స్థాయి. భౌతికజ్ఞాన మట్టం పెరిగేకొద్ది మానవుడు ఆస్థాయి బ్రతుకును, జీవన ప్రమాణాన్నే వాంఛిస్తాడు. జ్ఞాన స్థాయి పరిణితి చెందే కొద్ది తన బ్రతుకు స్థాయి ఏపాటిదో

అర్థం చేసుకుని-తన జ్ఞానస్థాయికి తగిన బ్రతుకు స్థాయిని నిర్ధారించుకుని దానినే హుందా తనంగా భావిస్తాడు. దానినే మానవజీవన హోదా స్థాయిగా ప్రమాణీకరించుకుంటాడు. దాని కన్నా ఏపాటి స్థాయి తక్కువైనా దానిని సహించలేదు. అవరోధాలను బ్రద్ధలు కొట్టడం మానవలక్షణం. ఆ లక్షణమే మనిషిని నిరంతర అన్వేషకునిగా చేసింది, చేస్తుంది. జ్ఞానం పరమం కానందున,-దాని ప్రభావ ప్రేరణలైన బ్రతుకుస్థాయి,- స్వేచ్ఛ సంకల్పాలు - హుందాతన భావనలన్నీ - పరిణామమైనవే. తన బ్రతుకును తానే నిర్ధారించుకోగలననే అంతర్గతభావన మానవ జీవనపోరాటంలో ఆసాంతం గమనిస్తాము.

బ్రతుకుస్థాయిని పెంచుకోవటానికి మనిషి చేసే పోరాటాలే స్వేచ్ఛాపోరాటాలు. జ్ఞానం ఆధారంగా రూపొందించుకున్న స్వేచ్ఛాసంకల్పాలే మనిషికి ఛోదకశక్తులై మనిషిని నిరంతర స్వేచ్ఛాపిపాసిని చేశాయి. ఇందులో మానవ సంకల్పమేగాని, దైవభావనగాని, ధ్వయిభావనగాని కనిపించదు. అన్నింటా మనిషి, అతని సంకల్పాలే. ఓకనాటి జ్ఞాన స్థాయిని బట్టి ఎర్పరచుకున్న భావనలు, వ్యవస్థలు, సంస్థలు, ఆచారాలతో తృప్తిచెందిన మనిషికి, జ్ఞానస్థాయి పెరిగేకొద్ది అవే అనాగరికంగా గోచరించి, ఆవ్యవస్థాపిత అంశాలపై పోరాటం జరిపి తన జ్ఞానస్థాయికి హుందాగా ఉండే వ్యవస్థల రూపకల్పనకు మనిషి చేసే సంఘర్షణే స్వేచ్ఛాపోరాటాలు. ధ్యేయం, సంకల్పం. ప్రయత్నాలు మానవకాలేగాని ఏ అతీతశక్తి ప్రమేయం అవసరం లేదు. ఈ ముగింపుకు చేరటం కూడా మానవ అనుభవసారమే. రకరకాల ప్రార్ధనలు, విధేయతలు, పారాయణాలతో తన స్థాయి పెంపుకు ప్రయత్నించిన మానవుడు- తన మనోవాంచల సాధనకు తానే కర్త అని గ్రహించి వివేకవంతుడయ్యాడు.

'తన భవితవ్యాన్ని తానే నిర్మించుకోగలన'నే, భావన ఈ ఆలోచనల ముగింపే. తన బ్రతుకును తానే నిర్ధారించుకుని, సార్ధకం చేసుకోగలడు తప్ప అన్యుల ప్రమేయం అవసం లేదనే అనుభవసారమిది. తన బ్రతుకును ఏ వస్తువులు సుఖమయం చేస్తాయనుకున్నాడో వాటి సాధనకోసం సాగిస్తున్నవే మానవ పోరాటాలు. బలవంతుడు తీరుస్తాడనుకున్నప్పుడు ఓకరీతి గాను, -భగవంతుడు, అతీతశక్తి తారుస్తుందనుకున్నప్పుడు వాటి ప్రసన్నతలకు అనుకూలంగా ఆచారసంప్రదాయాలను సృష్టించాడు. ఆచరించే మార్గం, సాధనం తన మనోవాంఛలను ఈడేర్చలేదనుకున్నప్పుడు ఆమార్గాన్నీ, సాధనాలను మార్చుడానికి కృషి చేస్తున్నాడు. తన మంచిజీవనం కోసం భగవంతుని, బలవంతుని సాధనంగా ఏంపిక చేసుకున్నాడేగాని, తానే సాధన కావాలనేది మానవవాంఛకానేకాదు. దానికోసమే అతీత శక్తి ప్రసన్నతకు-భయపెట్టటానికి, బలవంతం చేయటానికి రకరకాల విద్యలను రూపొందించి, ఆచరించి వాటి ఫలితాలను బేరీజు వేసుకొని మార్పులకు ఉపక్రమించటమే సంస్కరణలు-సంస్కారాల వంటివన్నీను. బ్రతకటంకన్నా మనిషిగా బ్రతకాలనే ఆరాటమే నేటి ఆధునిక పోరాటాల లక్ష్యం. అదే నాగరికత. దాని సాధనకోసం మనిషి రూపొందించినవే వివిధ సిద్ధాంత రాద్ధాంతాలు. వాటన్నింటి ధ్యేయం మనిషి మనిషిగా బ్రతకటమే.

'బ్రతకండి-బ్రతికించండి'-అనే భావన పూర్తిగా మానవ ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించదు. కొందరు సమర్ధులు. కొందరు అసమర్ధులు-కొందరు వివేకులు-కొందరు అవివేకులనే వివక్షా



37

రూపాన్ని ప్రదర్శిస్తుంది. బ్రతికేస్థాయి అందరికీ ఉండదనే భావన దీనిలో అంతర్లీనం. అభాగ్యులను బ్రతికిస్తున్నామనే ఫ్యూడల్ భావన జాతి ఔన్నత్యం-కుల ఔన్నత్యం నిగారించడానికి కారణభూత ఈ భావనే. సర్వ సమానత్వాన్ని అంగీకరించలేని స్థాయి ఆలోచన ఇందులో కనిపిస్తుంది. నేడు మనిషిగా మనిషి కర్తవ్యం ఇతరుల బ్రతుకును భుజాలకెత్తుకుని పెత్తనం చేయటం కాదు. వారిలోని నిపుణతను గుర్తించటం, ప్రోత్సహించటం. అదే ఆధునిక మానవునికి నిదర్శనం.

సామాజిక జీవనం బ్రతుకును సామూహిక స్థాయికి చేర్చింది. బ్రతకటం స్వభావరీత్యా వైయక్తికంకాగా సమాజ రూపకల్పనతో అది సామూహికమైంది. సమూహంలోని మంద ఆలోచనా ధోరణి కొందరిని కొందరు బ్రతికించాలనే ఆలోచనకు రూపకల్పన చేసింది. అందుకే 'బ్రతికించండి' అనే భావన దేవుడంత పాషండంగా మారింది.

'బ్రతికండి-బ్రతకనివ్వండి' అనే ఆధునిక భావన హుందాతనానికి ప్రతీక. బ్రతకటం సహజ హక్కుల భావనకాగా- బ్రతకనివ్వటం పౌర హక్కుల భావన. నేటి ప్రాథమిక హక్కులన్నీ బ్రతికించటం కన్నా బ్రతకనివ్వటానికి ఉద్దేశించినవి. ఇందులో ఇతరుల ప్రమేయం అనల్పం. మానవఔన్నత్యానికి, హుందాతనానికి నిదర్శనంగా మానవవాదానికి సంకేతంగా రూపుదిద్దుకున్న సమీకృత భావన ఈ నినాదం.

బ్రతకాలనే ఆరాటంతో మనిషి నిర్మించుకున్న భావనలు, సంస్థలు నేడు దాని కర్తలను బ్రతకనివ్వనందునే 'బ్రతకనివ్వండ'నే నినాదం ప్రబలింది. ఈ భావనే సామాజికన్యాయం, సమానత్వం, స్వేచ్ఛ, ప్రాథమికహక్కులకు మాతృక. అసమానతలు, అణచివేత, దోపిడి, స్వేచ్ఛారహిత స్థితుల వంటి అవరోధులే ఈ నినాదానికి ప్రేరణ. సమాజగతిని పరిశీలిస్తే-సమాజం సర్వజనులహితం, క్షేమం కోసం ఉద్భవించినా ఆచరణలోని లోపాలు, స్వార్ధశక్తుల ప్రమేయం వలన కొందరు నిరంతరం బ్రతకలేని స్థాయిలోనే ఉన్నారనేది వాస్తవం. కాగా, కొందరు మనిషిగాను, హుందాగాను బ్రతుకుతున్నామనకుంటూనే హీనమానవస్థాయిలో బ్రతికే వారంతా ఊహలలో తేలుతూ-శివాలెత్తిన వారేగాని వివేకవంతులు కారు. ఆ కోవలోనివే మతాలు, దైవం. సామాజిక నియమాలు-పూర్వజన్మ-పునర్జన్మ-ప్రారబ్ధం వంటి భావనలు.

'బ్రతకనివ్వని' వ్యవస్థలలో ప్రధానమైనవే విశ్వాసాలను ప్రభోదిస్తూ ఆలోచనను వివేచనను అణచివేసే వ్యవస్థలు, భావనలు. ఆ కోవకు చెందినవే మతం, కులం, మత నియమాలు, ఆచారసంప్రదాయాలు, దైవం, దైవికన్యాయం వంటివన్నీనూ. పవిత్రంగా జీవిస్తున్నామనుకుంటూనే అపవిత్రంగా, అమానుషంగా, హీనంగా, పాశవికంగా బ్రతకటంతో పాటు స్వయంమర్యాదను కోల్పోయారు. మనిషిని బ్రతననివ్వని స్థితిలోకి నెట్టివేయడం ఈ వ్యవస్థల ప్రత్యేకత. వ్యక్తుల మానసికవైఖరిని జయించి, వారిపై నియంతృత్వం చలాయిస్తున్న వ్యవస్థలే ఇవి. సాటి మానవులు స్వార్ధంతో నిర్మించిన వ్యవస్థలకంటే - మనిషిని అసలు మనిషే కాదనే ఆలోచనా వైఖరితో సాగుతున్న దైవభావన, మతం, కులం, వంటి శివాలెత్తించే భావనలే మనిషిని మనిషిగా బ్రతకనివ్వటంలేదు. పరంపరానుగతమైన ఈ భావనల నుండి వ్యక్తులను విముక్తులను చేసినపుడే వారు మనుషులుకాగలరు. మతప్రభోదాలు, ఆచార సంప్రదాయాల నుండి మనిషిని విముక్తి చేయాలి. విజ్ఞాన శాస్త్ర వెలుగులో వాటి సాధికారికతను ప్రశ్నించి. ఊహలలో నిండిన భావాల తాత్విక ముగింపునుండి ఆధునిక విజ్ఞానశాస్త్ర తాత్విక



38

ఫలితాలు ఆధారంగా రూపొందించుకున్న విధానాలే జీవితానికి సరైన గమనాన్ని, వాస్తవికతను చేకూర్చి వివేచనను మేల్కొలుపుతాయి.

'దైవం' ఏ శాస్త్రపరిశోధనకు అందని కాల్పనిక భావన. ఆ భావనే వివేచన గల జీవికి సంకెళ్ళువేసి అతని గమనాన్ని నిర్దేశిస్తూ స్వేచ్ఛాసంకల్పాలను నిరోధించగలిగింది. లేని దైవభావనను దాని సృష్టికర్త అయిన మనిషి వదులుకోలేక పోవటానికి కారణం దానిచుట్టూ అల్లిన సాలెగూడు. దాని ఆధారంగా రూపొందించిన ఆచార వ్యవహారాలు, ప్రభోదాలు, పవిత్రత వంటి అపౌరషేయ, పౌరషేయ గ్రంధాలన్నీనూ. వాటి ధ్యేయం చీమలబారు క్రమశిక్షణ, గొర్రెదాటు పోకడకు ఉద్దేశించినదేగాని మనిషిని మనిషిగా బ్రతకనీయటంకాదు. తన కర్మకు తానేకర్తననే భావనతో దైవభావనను ప్రశ్నించి, త్యజించగలిగినపుడే తనంతటతాను బ్రతకగలడు. తన బ్రతుకుకు, భవితవ్యానికి ఏ అతీతశక్తిపై ఆధారపడనపుడే మనిషి వాస్తవంగా ప్రవర్తించగలడు. ఆ వాస్తవప్రవర్తనలో ఉద్భవించేదే మానవవాదం. అదే మనిషి ఆచరణను మనిషిచుట్టు, సమాజం చుట్టూ త్రిప్పుతుంది. అచ్చటే మానవసంక్షేమం, సమతాభావపోరాటం ఆవిష్కృతమై స్వేచ్ఛా పోరాటాలు ఉద్భవిస్తాయి. మానవవాద భావనే మనిషిని మానసికబానిసత్యం నుండి విముక్తుని చేసి సృజనాత్మక జీవినిచేస్తుంది. దైవనీతి, మతాల ద్వేషం, కులపోరాటాల నుండి సమాజం విముక్తి చెందాలంటే మనుషులు మానసికంగా స్వేచ్ఛామయులు కావాలి. అలాంటి మనుషులే తాము బ్రతుకుతూ, ఇతరులను బ్రతకనిస్తారు. బ్రతకనీయమని ఏ శక్తినీ దేబరించదు.

బ్రతకవలసింది మనిషి. బ్రతకనీయవలసింది మనుషులనే గాని మతాన్ని, కులాన్ని, దైవాన్ని, ఆచారసంప్రదాయాలను కాదు. వ్యవస్థలు, భావనలు, సిద్ధాంతాలు మనిషి శ్రేయస్సుకోసమేగాని వాటికోసం మనిషికాదు. మతనియమాలు అసమానతలకు, ఉచ్ఛనీచ తారతమ్యాలకు అసాంఘిక, అమానుష ప్రభోదాలకు సంకేతం. మతగ్రంథాలలోని అమానుషాలే సంస్కరణోద్యమాలకు దారితీశాయి. మతం, కులం స్థానంలో మనిషిని కేంద్రంగా చేసినపుడే వ్యక్తులు మనుషులుగాను, మానవసమాజం మానవీయతను పొందుతుంది. కులమత పోరాటాలతో వ్యక్తులు సమిధలు కావటం నాగరిక లక్షణం కానేకాదు అనాగరికం. సాటిమనిషిని కులస్థునిగాకాక మనిషిగా చూడగలిగే ధోరణి రావాలంటే కులనిర్మూలన జరగాలి. అది వ్యక్తులలో పుట్టి వ్యక్తులతోనే, సాధ్యంకాని, బాహ్యప్రేరణతో సాధ్యంకాదు. కులమతాలకంపు వదిలించుకోకుండా ఎన్ని ఉద్యమాలు చేసినా అవన్నీ కుల, మత రంగునే పులుముకుని పతనమవుతారు.

సదాచారం, సనాతనం పేరుతోసాగే వ్యవస్థలను ప్రక్షాళన చేయగలిగినపుడే అభ్యున్నతి సాధ్యం. మనిషిగా బ్రతుకుసాధ్యం. అంతకాలం మనం పరాధీనులుగానే బ్రతుకుతాం. బ్రతకాలి – బ్రతకనివ్వాలి'– అదే అత్యున్నత మానవవిలువ. మానవవిలువలతో కూడిన సమాజగతిలో మనం ఎవ్వరినీ 'బ్రతికించాల్సిన' పనిలేదు. 'బ్రతకనిస్తే చాలు'. అదే హేతువాదులు మానవవాదులు కాంక్షించే మానవసమాజ ధోరణి. అందుకే మన పోరాటం చిరంజీవిగా సాగుతూ అవరోధాలను పెకలించి వేస్తూనేవుంటుంది. దీనికి అంతం ఉండదు. మానవసమాజంలో రుగ్మతలు ఉన్నంత వరకు మన ఉద్యమకారులకు చేతినిండాపనే.

# ద్రవిడవాదం మిథ్యా! - ఆర్యవాదం సత్యమా?

- డా॥ మలయశ్రీ

మన పండితుల కొందరి వాదాలు చూస్తుంటే - తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు - అనే సామెత, నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు - అనే కృష్ణశాస్త్రి గేయ పాదం గుర్తుకు వస్తవి. ఇంకొన్ని సార్లు 'అకటా బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్ - అన్ని పెద్దనామాత్యుని మనుచరిత్ర పద్యపాదం సైతం స్మృతిలోనిలుస్తుంది. శ్రోత్రియుల్ అనే చోటు ఇప్పుడు పండితులో అని మారిస్తే సరి.

అదేదో దక్షిణ భారతఅగ్రాన రామేశ్వరం / ధనుష్కోటి నుంచి శ్రీలంకకు సముద్ర గర్భంలో ఉన్న రాతి గుట్టల వరుసను రామాయణ కాలంలో నిర్మించిన 'రామసేతువు' - రాతి వంతెన అంటున్నారు. దానికే ఆదాం బ్రిడ్జి అని మరో పేరు. దాన్ని ఆదాంవంతెన అనుట ఎంత సత్యమో రామసేతువు అనుట కూడా అంతే 'నిజం'. రామాయణం మహాకావ్యేతిహాసం. అది వాల్మికి రచన. ఆ కావ్యరచన పూర్తి అయిన తర్వాత అయోధ్యలో శ్రీరాముడు జన్మించాడని నారద వాక్యం. ఆ మీద ఆ కథా అట్లనే జరిగిందనుటానికి నారద వాక్యం. ఆ మీద ఆ కథా రమ్యమైంది. జనాభిమానం పొందింది కాబట్ట అందలి పాత్రలు, ప్రదేశాలు వ్యాప్తి పొందివై. ఇప్పుడు చెపుతున్న ప్రదేశాలే అవి అని ఖచ్చితంగా చెప్పలేము. రంగనాయకమ్మ రామాయణ విష వృక్షం' రచన 1975 కాలంలో రామాయణ ఖండన మండన చర్చ బాగానే సాగింది. ఆరుద్ర, దాశరధిరంగాచార్య, లత మొ॥ వాళ్ళు పుస్తకాలు కూడా వచ్చినై

ఆ వానర సేన నిజమే అయితే అవి మాట్టాడలేవు, కోతుల మాట్లాడితే వాటితోకలు అబద్ధం. అవి వారి అయుధాల కొరడా తాళ్ళు కావాలే. వాలి సుగ్రీవులు భార్యలు తారరుమలకు తోకలు లేవు.

ఆ లంక ఈ సింహళమే అయితే అక్కడ రావణ కాష్టం ఇప్పుడూ రగులుతుండాలె. లేదే! రావణ కోట, మండోదరి సీత గుళ్ళు ఉన్నాయంటే ఇక్కడి భద్రాచలం పరణశాలవలె అనంతర కాల రామభక్తుల నిర్మాణాలు. ఆ లంక ఈ లంక కాదనుటానికి ప్రత్యక్ష సాక్ష్యం వాల్మీకి రామాయణ వరణానే. ఆంజనేయుడు అంకకు లంఘించే సమయంలో సముద్ర శతయోజన విస్తీర్ణం అని ఉంది. విస్తీర్ణం అంటే పొడుగు కాదని తెల్సు, కాని ఎగిరేవానికి చెప్పవల్సింది పొడుగు దూరమే - వెడల్పు కాదు. ఇప్పుడు చూస్తే భారత్ - శ్రీలంకల మధ్యదూరవ 30 మైళ్ళే, తగ్గింది అనవచ్చు. కావచ్చు మరి ! రచన తప్పు చెప్పిందో?

ఇప్పుడు సముద్రగర్భ సేతునామక శిలాకుడ్యాన్ని పరిశీలిస్తే తెలువదా - అది ప్రకృత్తి సహజమైన కొండల చాలా ? లేక కృత్రిమ నిర్మాణమా ? అనేది. అది చేతకాదు - అందుకు ఒప్పుకోరు, పూనుకోరు. అట్లయితే నిజంతేలి తాము ఓడిపోక తప్పదని మన భక్తులభయం. ఎందుకంటే రామకథ కల్పితం.

మన దేశభక్తి, పూర్వ సాహిత్య - సంస్కృతి ఆసక్తి ఉంటే తప్పుకాదు కాని, వృధాఛాందసాక్రోశం అయితే ఎట్లా ? ఏ మత విశ్వాసులకైనా, అవిశ్వాసులకైనా సత్యసంధత హేతు దృష్టి అవసరం. ఈ మధ్య ఆ రాతి సేతువును కొంత పగిల్చి నౌకమార్గాన్ని ఏర్పరిస్తే



20

అరేబియా సముద్రం నుంచి హిందూ మహాసముద్రం ద్వారా బంగాళాఖాతం వేళ్ళేనౌకలకు శ్రీలంకచుట్టూ తిరిగిపోయే ప్రయాస, దూరం, వ్యయం తగ్గుతుందనే ఆలోచన వచ్చింది మన ప్రభుత్వానికి దానిపై రభస మొదలై వాద ప్రతివాదనలు వివిధ దిన - వార పత్రికలు ప్రచురిస్తున్నవి.

నా దృష్టిలో పడ్డది "ద్రవిడవాదం మిథ్య" అనే వ్యాసం (ఆంధ్రభూమి దినపత్రిక), ది. 16-10-2007, రచన డా॥ ముదిగొంగ శివప్రసాద్ గారు) దాని విషయ సమాలేకనమే ఇది. ఆ వ్యాసం ఆరంభం చూడండి.

"భారతదేశం అంటే ఏమిటి ? రాముడు, కృష్ణుడు, శివుడు ఈ ముగ్గురే" అన్నది రాంమనోహర్‌లోహియా అని, వ్యాసకర్త కథనం, "బుద్ధుడు" గుర్తుకు రాలేదో లోహింపాగారికి, పురాణ, దేవుళ్ళు తప్పమరే చారిత్రక చక్రవర్తులూ, ఇక్కడి నిర్మాణాలు, పర్వతాలు, నదులు, నగరాలు జన జాతులు - జీవనరీతులు, వనాలు - పంటలు, పశుపక్షులూ దేశప్రత్యేకతలు కావో.

ఇంగ్లీషువారు పాకిస్తాన్‌ను వేరు చేసిందే కాక ద్రవిడులు వేరనే వాదం లేపి వుళ్ళిరట.

ఉత్తర భారత సంస్కృతం హిందీ మొ॥ భాషలకు, దక్షిణ బారత తమిళ కన్నడ తెలుగు మొ॥భాషలు భిన్నం కాదా ? తెలుపు నలుపు జాతులు అంతా ఒక్కటేనా ? ఆర్యులు త్రైవర్ణికులు అంటే, చతుర్థ వర్ణశూద్రులు, పంచములు, గిరిజనులు ఎవ్వరు ? అనార్యులే కదా! వారిలో ద్రవిడులు లేరా ? అన్ని రంగుల వాళ్ళు అన్ని కులాల్లో ఉన్నారంటు అది వర్ణ సాంకర్యం.

"కోశాంబి అనే ఒకడికి" చూడండి సంభోదన, ఎంత మర్యాదో ! వేదంలో ఇంద్రుడు శంబరారి కదా. రాక్షసులెవరు ? ఆర్యులేనా ! అవును వారికి పూర్వదేవతలని పేరు. కశ్యపునికి దితివల్ల దైత్యులు, అతిది వలన ఆదిత్యులు పుట్టినట్లు పురాణదాతలు పాలివైరం.

ఆర్య అనేది పూజనీయ శబ్దమట, ఆర్యావర్తం ఆ జాతి సంచార భూమి కదా. అర్యపుత్రా! అనే నాటి సంబోధన ఈనాటి కులవాచక పదాలకు పేర్లను తగిలించుకొనుట వంటిదే. 'కృణ్వంతో విశ్వమార్యం' విశాల భావమట. ఇతరులు బలిమితో ఈ దేశీయుల్లో కలిసిను ఎందరో కాని మనవాళ్ళు ఉదారంగా కలుపుకోలేదు - కలుపుకోరు. ఇక్కడ చాతుర్వర్ణాల, వందల కులాల అడ్డుగీతలాయె. అవి మారకూడదని స్మృతులు నిబంధనలు విధించె. పురాణాలు వాటినే బలపరిచె. రాజులు వాటినే అనుసరించిరి.

కృణ్యంతో ........ అనేది ముస్లింలు క్రైస్తవులు ఇతర దేశాల జాతుల జనాల తమ మతాల్లో చేర్చుకున్నట్లుకాదు. తామే ప్రపంచమంతటా విస్తరించన్నదే భావం. ఆర్యులకు తమ దేవతలు, యజ్ఞాలు, వర్ణభేదాలు విశ్వమంతా వ్యాపించాలనే దురాశ.

ఆ తరువాత తమిళనాటి డి.కె., డి.యం.కె.ల మీద విమర్శ - రచయిత దాడి - "వారికి ఢిల్లీలో గౌరవం లభించిందని వీరికి బాధ. ఎందుకంటే వారు హిందూమత ద్వేషులట. పరమతాల ప్రేమికులా ? డి.కె.-నాస్తికులు, కమ్యూనిజమా అంతే, ఏ మతాలనూ ఒప్పదు. భౌతికవాదం. "రాముడు చెప్పిన పురషార్థవాదం" అట. అట్లెందుకు కూర్చున్నరో మరి వీళ్ళు.

ఆపైన 'రామ సేతువు' ప్రస్తావన. కురుణానిధి, టి.ఆర్.బాలు, కారత్‌లపై విసుర్లు -



౫౯

నింద. ముదిగొండవారి ముద్దుమాటలివి – 'రాముడు వసిష్ఠుని వద్ద, విశ్వామిత్రుని వద్ద సమస్త విద్యలు అభ్యసించాడు (మొత్తం!) కృష్ణ యజుర్వేదంలోను, ఆథర్వవేదంలోనూ సివిల్ ఇంజనీరింగ్ గూర్చి విస్తృతంగా వర్ణించబడింది (బాపురే), ఇంకా జ్యోతిష్యం, గాంధర్వం, ఆర్చరీ (విలువిద్య), మెడిసిన్ (వైద్యం) అంటి ఎన్నో అనూహ్యమైన విద్యలు (భేష్) రాముడు అభ్యసించాడు ! వారెవాహ ! అవన్నీ వేదాల్లో ఉన్నాయట. ఇంకా వారి ప్రశ్నలు చూడండి "మరి, కారత్ కరుణానిధులు పాండిత్యం ఏమిటో తెలుసుకోవచ్చా ? సినిమాలకు మాటలు, పాటలు వ్రాయడమూ, చైనా అడుగులకు మడుగులొత్తడమూ శాస్త్రపాండిత్యం కిందికి రాదు. ఇక్కడ క్రమం తప్పింది. కరుణానిధి కవి. కారత్ కమ్యూనిష్టు. ఇదండీ వీరి పురాణాల సమర్ధన, పరదూషణ పాండిత్యం.

రాముడు సుశేణ, నీల, జాంబవంతులనే ఇంజనీర్లతో సేతువు నిర్మించిండట – ఉడుత మోసుకుపోయి పోసిన ఇసుకతోని !

అలనాటి వానర భల్లూకాలు నరులే అని సురవరం వారు నిర్నయించినట. అది నిజమే. మరి సురవరం ప్రతాపరెడ్డి గారు రామాయణంలోనిది శ్రీలంక కాదన్నారు. అది గోదావరి నది డెక్టాలంక అనే కాదా. అది చెప్పరే వీరు.

వానరసేన వీరత, అవతార పురుషుడని రాముని మహిమలు, రాక్షస మాయలతోనే కదా రామకథ రంజు. వాళ్ళంతా సామాన్య మానవులే అంట – అయితే, ఇక రామాయణం ప్రత్యేకత ఏమిటి ? ఉత్త కథను నీతులకు అంతగా ఆకర్షణ ఉండదు.

"రామ కథ జరిగిందనడానికి ఆధారం ఉందట" ! అయినా – మతంలో విశ్వాసం ప్రధాన భూమిక పోషిస్తుంది. "ఇదేం తిరాకాసో? అవును సత్యం కంటే విశ్వాసం గొప్పది. కాని వాటితో మనం ఆనందిచాలె తప్ప విధ్వంసాలు సృష్టించుకోవద్దు కదా.

"ఈ దేశం వేయి సంవత్సరాలు ముస్లింలచేత, క్రైస్తవుల చేత, ఇప్పుడు నాస్తికుల చేత పాలించబడుచున్నది? ఇది తప్పు నిర్ణయంకదండీ ! సెక్యూలర్ రాజ్యాంగమని పేరే కాని, మన దేశంలో మతాలే రాజ్యమేలుతున్నయండీ, దేవుళ్ళు, ప్రార్థనా మందిరాలు, ఉత్సవాలు, పర్వాలు, మంత్రాలు, హత్యలు.... ఎన్నని? పత్రికలు చూడండి. అంతా మంత్రాల వీరంగమే. నాస్తికమెంత? అది అజగరం నోటిన ఆవగింజంత.

నాస్తికం వేదాలకు మొదటిది. ఆస్తితోనే నాస్తి పుట్టింది. చార్వాక లోకయతాలు వేద సంస్కృతికి సమాంతరపువి. హిందూ మత గ్రంథాల్లోనే విజ్ఞానం. అది నైతిక జీవన మార్గం. "నాస్తికో వేద నిందక! అని నాస్తికుల నిందిస్తిరి – చంపిస్తిరి. అవైదకాలని జైనబౌద్ధుల తరిమేస్తిరి. అప్పటికీ ఇప్పటికీ మతాల రాపిడీ – దోపిడీ ప్రధానమాయె. అది మీ ఆస్తికుల మాయేనాయె.

ఇక ద్రవిడ బాషా వాద ఖండన సాగింది.

'జనని సమస్త భాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్' అనే వాద సమర్ధకులు వీరు. తెలుగు సంస్కృతం నుంచి పుట్టిందట, సరే అదే నిజమందాం కాని,

'నేను అక్కడికి/మా వూరికి ఇప్పుడే పోతున్నా" ఈ వాక్యంలో సంస్కృత – పాకృత భాష పదమేమి ? లేదే. సంస్కృత పదంలేని తెలుగులో మాట్లాడగలం. తెలుగు పదాలు,



112

ప్రత్యయాలు లేని సంస్కృత శబ్దాల తెలుగు వాక్యాన్ని ఒక్కటైనా చూపగలరా ? అది సాధ్యంకాదు. ఇంకా ఎందుకండీ ఈ కుతర్కం - వితండ వాదన.

ఆ తర్వాత తమిళ కమ్యూనిస్టుల నింద. ఆర్య వైదిక హిందూ మత విశ్వాసులు - ప్రచారకులు ప్రస్తుతి ఉంది.

ఏమిటీ అక్కసు ? ఎవరి మీద ఈ కసి - ద్వేషం. ద్రవిడ/ఆంధ్ర - దక్షిణ భారతదేశాన ఉంటూ, ద్రవిడ భాషా కుటుంబ ప్రధాన భాష తెలుగు మాట్లాడుతూ ఎందుకండీ అన్యభాషా - సంస్కృతి దురాభిమాన స్తోత్రం, పురాచరిత్ర - ఆదిమ జన జీవన సంస్కృతి, ఆధునిక విజ్ఞాన వాస్త్ర ఆవిష్కరణల, విశ్వవిద్యాలయాల పరిశోధనల ఫలితాల విషయం పరిజ్ఞానం ఏ మాత్రమున్నా ఈ అసంబద్ధ ప్రలాపాలుండవు. మనకు సత్యదృష్టి, నదనవగాహన సామరస్యం ముఖ్యం.

అవేమైన సమస్యలుంటే - రామసేతువు వంటివి, మనదేశ, మానవజాతి ప్రయోజనాలను గుర్తించి పరిష్కరించుకోవచ్చు.

ద్రవిడవాదం అబద్ధం కాదు, అది ఆర్యవాదం అంతటి సత్యమైనది. ఇప్పుడు కావాల్సింది ఆదిమ జాతుల వివాదాలు కాదు - మానవ జాతుల, సమైఖ్య నినాదం - అని అందరం గ్రహించిమెదిలితే మంచిది.

---

Statement showing ownership and other particulars about HETUVADI required by Rule 8 of the Registration of newspapers (Central) Rule 1956;

Form - IV

1. Place of Publication : Chirala
2. Periodicity of publication : Monthly
3. Printer's Name, Nationality Address : R. Venkatadri, Indian
Chirala - 523155. (A.P)
4. Publisher's Name, Nationality Address : "
5. Editor's Name, Nationality Address : "
6. Name & address of owner : "

I, R. Venkaradri, Printer & Publisher, Editor and owner Hetuvadi hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.)

R.VENKATADRI,

Editor, Printer, Publisher & Owner, Hetuvadi, Chirala,

# భాష పుట్టుక

- ప్రేమ్‌చంద్.

జంతువులలోని లేని అదనపు శక్తి మానవునికి లభించినందునే, తన జీవన విధానాన్ని తన కిష్టమైన రీతిలో నడప గలుగుతున్నాడు. ఆలోచన-ఆచరణ. జ్ఞాపక శక్తి-ఇవి ప్రత్యేకంగా మనిషికి సంక్రమించిన గుణాలు. తన అనుభవాలను తాను సద్వినియోగ పరచుకోవటమే కాకుండా, భావి తరానికి అందించ గలుగుతున్నాడు.

తొలి మానవుని మాదిరి ఒంటరిగానే కాలం గడుపుతుంటే, భాషతెలియటంకాని-ఆలోచన కాని లేక, అజ్ఞాని గానే వుండి, జంతువులలో తోటి జంతువుగా జీవనం గడిపేవాడు. ఎప్పుడయితే సంఘ జీవనానికి అలవాటు పడ్డాడో, తోటి మానవునికి ఏదో చెప్పాలని, ఎదుటి వారి నుంచి ఏదో తెలుసుకోవాలని తాపత్రయం కలగటంతో, అడవులు వదిలి-మైదానాలలో గుంపులుగా సంచరించటం, అహారపు అలవాట్లు మారటంతో అతని అభ్యుదయానికి-మానవ పురోగమనానికి తోడ్పడ్డాయి.

60 లక్షల సంవత్సరాల నాడు చింపాంజీలు-మానవులు తమ పూర్వీకుల నుండి విడిపోయారు. చింపాంజీలకు సైగలు చేసే పరిజ్ఞానముంది. సైగలద్వారా అవి ఏ విషయమైనా గ్రహించగలవు కాని, మాట్లాడలేవు.

కోతులు సైగల ద్వారా రాగల ప్రమాదాన్ని తమ తోటి వాటికి తెలుపగలవు. సైగలకు తోడుగా కూతలాంటి శబ్దాలతో వాటి ముఖ భంగిమలు-చేతి సంజ్ఞలు ఎంతో ఉపయోగకారి అయ్యాయి. ఉదా॥ చెట్టుపై కోతులున్నాయనుకోండి! క్రింది కొమ్మపై ఒక కోతి వుంది! నేలపై పాము పోతుంది! ఆ పామును చూచిన కోతి ఒక సంకేతం, అంటే ఒక శబ్దం లాంటి అనుకరణ చేస్తుంది. చెట్టుపై ఒకశబ్దం. చెట్టుపై ఏదైనాపక్షి వాలితే చెట్టుపై వుండే కోతులు చేసే శబ్దానికి క్రిందనున్న కోతులు పైకి చూస్తాయి.

జంతువులు ఒకే విధమైన వాతావరణాన్ని తట్టుకోగలవు. వాతావరణ పరిస్థితి మారిందనుకోండి, అవి తట్టుకోలేక నశించిపోతాయి.

మానవుడట్లాకాదు! ఎటువంటి వాతావరణాన్నయినా తట్టుకోగలడు!

ఎప్పుడు ఎక్కడకు పోయి రావలన్నా పోయి, రాగలడు. విశ్వంలో జరిగదే మార్పులను-వాతావరణ మార్పులను-భూకంపాలను-వరదలను ముందే కనిపెట్టి తగిన జాగ్రత్తలు తీసుకొంటున్నాడు!

మసాచూసెట్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన భాషా శాస్త్రవేత్త స్టిఫెన్ పింకర్ భాష పుట్టిన తరువాతే సాంఘిక జీవనం అభివృద్ధి చెందిందని, మానవునితో భాష-సంఘ జీవనం-విజ్ఞానం ఒకదాని కొకటి ముడి వేసుకోవటంతో మానవ పరిణామంలో గణనీయ మార్పు జరిగిందన్నారు.

భాషకు-న్యూరల్ నెట్‌వర్కుకు సంబంధించిన జన్యువులను గుర్తిస్తే మెదడులోని భాష తాలూకు యంత్రాంగాన్ని గురించిన వివరాలు తెలుసుకొనే అవకాశముందని జన్యుశాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు.

నోయ్ చోయ్స్కి-మార్క్ హసర్జ భాష పుట్టుకపై ఒక వ్యాసాన్ని ప్రచురించారు. మానవ మెదడులో గల కొన్ని వ్యవస్థలు మారుతున్న మానవునికి అవసరం లేక పోవటంతో నిరుపయోగంగా ఉన్నాయి!

భాష యొక్క పునాదులు మానవ జినోమ్‌లో ఎక్కడ వున్నాయో తెలుసుకొనేందుకు ఉధృతంగా జరుగుతున్న పరిశోధనల ద్వారా వెలుగులోకొచ్చే రోజు దగ్గరలోనే వుంది.

50 వేల సంవత్సరాల క్రితం ప్రపంచ జనాభా 2వేల లోపు! తొట్టిలాంటి శబ్దాలున్న వీరి భాషను మౌలిక భాష అంటారు!

ఎప్పుడయితే ఆఫ్రికా ఖండాన్ని వీడి, ప్రపంచం మలూమూలలా పోయిస్థిరపడ్డారో, ఈ ఒక్క భాషా 19 మహా భాషాకుటుంబాలుగా విడిపోయాయి!

వ్యవసాయ అభివృద్ధి చెందటంతో సంచార తెగలపై రైతుల ఆధిపత్యం ఎప్పుడైతే పెరిగిందో, అప్పటి నుంచే భాషా సంస్కృతికి గట్టి పునాది పడింది.

19 మహాకుటుంబాలు వాడిన భాషలు(1) ఎస్కిమో ఆల్యుట్ (2) అమిరెండ్ (3) నాడెనే (4) ఉరాలిక్ (5) యుకగిర్ (6) ఆసో ఆసియాటిక్ (7) నైలోసహారన్ (8) చుట్కికమ్ చట్కాన్ (13) నైనో టిబెట్ (14)మవోయావో (15) ఆఫ్రో ఆసియాటిక్ (16) డాయిక్ (17) ద్రవిడియన్ (18) ఇండో పసిఫిక్ (19) ఆస్ట్రేలియన్!

# సత్యసాయి బాబా ముసలి వాడయ్యాడు.

సత్యసాయి బాబా ముసలివాడయ్యాడు, ఏ జిమ్మిక్కులూ ఆయన్ని ముసలి వాడుకాకుండా ఆపలేకపోయాయి. రోగగ్రస్తుడు కాకుండానూ ఆపలేకపోయాయి. చావు దగ్గరపడుతుందని ఆయన భయపడుతున్నాడు. భయమెందుకు? చావు సహజమే-జీవులకూ, నిర్జీవులకూ కూడా. చావంటే ప్రస్తుతం వున్న స్థితి నుంచి మార్పే. ప్రపంచంలో ఏ వస్తూవూ రూపం మారకుండా వుండదు. భూమి త్రవ్వకాల్లో ఎక్కడో దొరికినయెముక ముక్క ఎన్నివేల సంవత్సరాల నాటిదో లెక్కకడుతున్నారంటే, అన్ని వేల సంవత్సరాలలోనూ అది పొందిన మార్పు ద్వారానే అలా లెక్కకడుతున్నారని అర్థం. కాబట్టి స్వాములందరూ, దేవుళ్లందరూ చచ్చిన విధంగానే సాయిబాబా చస్తాడు. మనమందరమూ ఎప్పుడో ఒకప్పుడు చస్తాం. అలా అని ఎవ్వరూ కావాలని చావును అహ్వానించరు. సహజ పరిణామంలో అదిరానే వస్తుంది. బోయవాడి బాణంతో కృష్ణుడు చచ్చాడు. సరయూ నదిలో దూకి రాముడు చచ్చాడు. అలా అలాకాక మరో విధంగానైనా సాయి బాబా చస్తాడు. అయినా, ఇంకాయింకా బ్రతకాలనే పేరాసతో ఆయన విశ్వరూప ప్రదర్శనకు తలపడి భంగపాటుకు గురయ్యాడు. ఇందుకు ముఖ్యకారకులు ఆయన్ని అందుకు పురికొల్పిన అంతర్గ కూటమే. ఆ కూటమికి బానిసయిన సాయిబాబా, వారి మాటలను నమ్మి, వారు యేర్పాటు చేసిన పరికరాలతో విశ్వరూప ప్రదర్శన అనే జిమ్మక్కును ప్రదర్శించడానికి తలపడకా తప్పలేదు, భంగపడకా తప్పలేదు. ఆయనకు కాలం సమీపించిందన్న భయం ఆయనకంటే, ఆయన్ని నడుపుతున్న అంతర్గ్రహకూటమికే ఎక్కువగా వున్నట్లుంది.

– రావిపూడి

# సల్లకొచ్చి

సల్లకొచ్చి ముంత దాసడమెందుకు?
యేడవకు యేడవకు యెఱ్ఱి బాగుల నాగన్న!
వొప్పడానికి యెరుకలేక, సెప్పడానికి సరుకులేక
సిందులేస్తే నొప్పి తప్ప, లాబమేంటి?
నీకు ముందు మేముండగ, నీ వెందుకు గుడిసెందుకు
వేరెందుకు వేసావో సెప్పరాద?
కలుసుంటే కలదు బలమని యిప్పుడెందుకు సనగడం?
గద్దే లెక్కడంకోసం ముటాలు కట్టడం రాసపోళ్లకేసెల్లు
వుమ్మడి పట్టుకోసం జంగిలి. గంపులు కడితే
వుద్దెమాల మద్దె పెద్దరికం కోసం
గుద్దులాట బోణీ కొట్టి, వాటిని సంపేసుద్ది?
రాసకీయతండాలకు, పరమ దరమ సంగాలకు
కాడికలుపు యవ్వారం మాదికాదని తెలీదా?
అయినా యెందుకీ దాగుడు మూతలాట?
ఆ యేదుపేదో బైరంగానే యేద్వరాద?
సరుకు వున్న వుద్దెమాలకు సావన్నది రానెరాదు
సలవపందిరి దగ్గర సరుక్కు కొరతుండదు.
పాత సరుకు పోతుంటే కొత్త సరుకు వొత్తుంటది
డామేసా సరుకును కొని అంగట్లో పెట్టుకుంటె
చిత్తకార్తె సంగాలకు కొత్త వూపిరి రానెరాదు
వున్నది కాస్త వూడిపోయి దివాలా తీసి సత్తాయి.
సరుకు మురిగి పాదయి, సెక్క తిరగేయాల్సి వత్తుంది.
పిల్లి మొగ్గలూ, కోతి గంతులూ వేసి
వోపికున్నంత కాలం వొళ్లిరుసుకుంటే
జరగరానిదే జరిగి తీరుద్ది,
నక్కపోయాక బొక్క తొవ్వొద్దు.
సున్నాకు ముందొక అంకె వుంటేనే సున్నాకుయిలువ
సున్నాకు సున్నాలను కలుపుకునే సంగం
తోడు దొంగల ముటాగా తేలుద్ది.
ఆ ముటాదండెత్తేదిక వెనక నుంచి అంకెల మీదేనా?
దొంగేసాలెందుకు? సల్లకొచ్చి ముంత దాసడ మెందుకు?
ముసుకుదీయ్, అసలు నీవేందో, నీకతేందో సెప్పరాద?



46

# రావిపూడి రచనల సంపుటాలు

## ఇప్పటి వరకు సిద్ధమైనవి :

**1. హేతువాదం** (352 పేజిలు) వెల రు. 150/-
హేతువాదం-నాస్తికత్వం, హేతుత్వం-మతతత్వం, హేతువాద వైఖరి, వివేకం-అవివేకం, భౌతిక వాస్తవిక వాదం, కార్యకారణత, దృక్పథం, నైతిక విప్లవం

**2. హ్యూమనిజం** (492 పేజిలు) వెల రు. 200/- హార్డ్ బౌండ్ రు. 250/-
మానవుడు-సమాజం-ప్రకృతి, రాడికల్ హ్యూమనిజం, ఎం.ఎన్.రాయ్-R.H, సత్యాన్వేషణ, సెక్యులరిజం, లయ-అవలయ, హేతువాదం, నియతివాదం మానవవాదం

**3. నాస్తికత్వం** (393 పేజిలు) వెల రు 150/- హార్డ్‌బౌండ్ రు. 200/-
నాస్తికత్వ వైఖరి హేతువాదం-అజ్ఞేయవాదం, చరిత్ర గర్భంలో చార్వాకం, చార్వాకుల కథలు, నాస్తికులున్నారు జాగ్రత్త, నాస్తికత్వం-నాస్తితత్వం చార్వాకుల చర్చ

**4. మార్క్సిజం** (479 పేజిలు) వెల రు 150/ హార్డ్‌బౌండ్ రు. 200
మార్క్సిస్టు భౌతికవాదం, గతితార్కిక గందరగోళం, భావవిప్లవం-వర్గచైతనం, మార్క్సిస్టు వాస్కవికత, మార్సిస్టు మార్గంలో, గతితార్కిత భౌతికవాదం శాస్త్రీయమా? మార్క్సిజం-హ్యూమనిజం, కమింటరన్‌లో రాయ్

**9. ఆది శంకరాచార్యః వ్యక్తిత్వం-తత్వం** (172 పేజిలు) వెల రు 100/-
ఆది శంకార్యచార్యః ఆది శంకరాచార్యుడి హత్య, శీలం.

**10. మనుధర్మాల కౌటిల్యం** (252 పేజిలు) వెల రు 150/-
మనుధర్మ శాస్త్రం మానవ ధర్మ శాస్త్రమా? మనుస్మృతి మైనస్ అశుద్ధం.

11. Reason & Un Reason (88 పేజిలు) వెల రు. 50/- (Lecturers)



U7

# ఇక ముందు రాబోయే సంపుటాలు.

5. విశ్వాన్వేషణ – విశ్వ తత్వం. (అంచనా పేజీలు 200)
6. జీవమంటే యేమిటి? జీవం–ఆత్మ, సత్తు–చిత్తు (120)
7. శాస్త్రం–అశాస్త్రంః డార్విన్ నిజం–హేతువాదం, ఇతర శాస్త్రీయ వ్యాసాలు, విమానశాస్త్రం (300)
8. మత జాడ్యాల మచ్చుతునకలు, బైబిలు సృష్టివాద, నైతిక విప్లవం. (200)
12. కళ–శాస్త్రం–తత్వం–హేతువాదం, కర్మవాదం–నియతివాదం (150)
13. కవి రాజు త్రిపురనేని, పీఠికలు, స్వామినేని హితసూచని, ఇతర వ్యాసాలు (250)
14. వాస్తువు శాస్త్రమా? జ్యోతిషం బండారం (200)
15. వ్యాసవాణి (300)
16. ప్రశ్నోత్తరాలు (200)
17. అడుగు జాడలు (150)
18. మనం ఏమి చేయాలి. (హేతువాద ప్రణాళిక)

# ప్రచురణ పూర్తయి అమ్మకానికి సిద్ధంగా వున్నవి

1. ఎం.ఎన్. రాయ్–భారత కమ్యూనిజం (పేజీలు 600) వెల రు. 100/-
2. మేనూ–నా రచనా వ్యాసంగం (పేజీలు 160) వెల రు 50/-

# రచన పూర్తి కానివిః

1. వైదిక ఛాందసం, ఔనా వేదంలో అన్నీ వున్నాయా?
2. నేనూ– హేతువాద మానవవాద ఉద్యమాలు 3. మరపురాని ముచ్చట్లు.

# హేమా పబ్లికేషన్స్, చీరాల

'హేతువాది' రజతోత్సవాల సందర్భంగా విడుదలైన రావిపూడి రచనల సంపుటాలు

– ప్రచురణకు దాతల వివరాలు

| | | |
|---|---|---|
| 1. | చుండూరు రవి కుమార్, చీరాల | రు॥60000/- |
| 2. | కరణం రవీంద్రబాబు, బాపట్ల | 10,000/- |
| 3. | గోరంట్ల రాఘవయ్య, కోటపాడు | 5000/- |
| 4. | డా॥ డి. క్రిష్ణారెడ్డి తిరుపతి | 9000/- |
| 5. | ఎన్.చౌదరి బాబు, విజయవాడ | 50,000/- |
| 6. | జె.ఎల్ రెడ్డి, ఢీల్లీ | 10,000/- |
| 7. | కె.మధు, హైదరాబాదు | 10,000/- |
| 8. | భారత నర్సింగ్ హోమ్, భద్రాచలం | 5000/- |
| 9. | వత్సవాయి నారాయణరాజు, ఇంకొల్లు | 2000/- |
| | మొత్తం రు. | రు॥ 161,000/- |
| | ప్రచురణల ఖర్చు మొత్తం : | 2,32,00/- |
| | లోటు : | రు. 71,000/- |

హేమాపబ్లికేషన్స్, చీరాలకు ఇప్పటివరకు ఉన్నలోటు 74,295/-

## "హేతువాది"కి జమలు

### 'హేతువాది'కి జీవిత చందాదారుల జమలు

| | | |
|---|---|---|
| 1. | వల్లభనేని వెంకట్రాయుడు, ఇంకొల్లు | 1000/- |

### 'హేతువాది'కి విరాళాల జమలు

| | | |
|---|---|---|
| 1. | జి. రవీంద్రనాథ్ | 500/- |
| 2. | పాటిబండ్ల వెంకటపతిరాయలు | 1000/- |
| 3. | కె.వి.బి.కి. దుర్గా ప్రసాద్‌రావు, తెనాలి | 500/- |
| 4. | పెరుమళ్ళ వెంకట స్వామి | 100/- |
| 5. | డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి తెనాలి | 500/- |
| 6. | సిహెచ్. వెంకటరమణ, సరిపల్లి | 200/- |
| 7. | పి. సుబ్బరాజు, జిన్నూరు ద్వారా | 200/- |



49

# 'హేతువాది'కి నూతన చందాదారుల జమలు

| | | |
|---|---|---|
| 1. | కె. హెచ్ శివరామ్, గౌరిబిడనూరు | 100/- |
| 2. | టి.సి సుబ్బారాయుడు, ఆదోని | 100/- |
| 3. | ఏ.కె. రామరాజు, పెరంబూరు | 100/- |
| 4. | పి.శ్యాం మోసెస్, ఏలూరు | 100/- |
| 5. | పెరుమాళ్యా వెంకటస్వామి | 100/- |
| 6. | గుబ్బల క్రిష్ణ, చింతపల్లి | 100/- |
| 7. | తుమ్మల లక్ష్మీనారాయణ, పెదపూడి | 100/- |
| 8. | నంద్యాల సుబ్బారావు, ఆకివీడు | 100/- |
| 9. | నిడమనీరు శ్రీనివాసరావు, మద్దిరాలపాడు | 100/- |
| 10. | గుబ్బల క్రిష్ణ, చింతల పల్లి | 100/- |
| 11. | మల్లి ఖూర్జున్, షాద్‌నగర్ | 100/- |
| 12. | కోడాలి శ్రీనివాస్, గుంటూరు | 100/- |
| 13. | కె. రాఘవలు, కొత్తట్ల | 100/- |
| 14. | పి. రామక్రిష్ణ, పాలకొల్లు | 100/- |
| 15. | ఎన్. వి. నాగభూషణా చార్యులు, పాలకొల్లు | 100/- |
| 16. | మున్సిపల్ గ్రంథాలయం, పాలకొల్లు | 100/- |
| 17. | కె.ఆర్. దివాకర్ రాయ్, విశాఖపట్టడం | 100/- |
| 18. | యిాళ్ళ సూర్య నారాయణ, పార్వతపురం | 100/- |
| 19. | యం. పెదహనుమంతరావు, కల్లూరు | 100/- |
| 20. | కె. పార్ధ సారధి, శ్రీకాకుళం | 100/- |
| 21. | జి. వెంకటేశ్వర్లు, కనిగిరి | 100/- |
| 22. | జె.కె. నాగయ్య, పెడన | 100/- |
| 23. | కె. మురళీధర్ రావు, గుంటూరు | 100/- |
| 24. | పాలెం రాములు, ముట్లూరు | 100/- |
| 25. | ఎ. జగద్గురు, కర్నూలు | 100/- |
| 26. | సి.హెచ్. రామ సుబ్బారెడ్డి, వడ్లరామపురం | 100/- |
| 27. | కోరె సుబ్బా రామయ్య, అనుమలపల్లి | 100/- |
| 28. | విద్వాన్. జి. నారాయణ, హైదరాబాదు | 100/- |
| 29. | బి.శివ, హైదరాబాదు | 100/- |
| 30. | యం.డి. జనీమియా, నదిగూడెం | 100/- |
| 31. | చలసాని వెంకట సుబ్బారావు, మేడ్చెల్ | 100/- |



50

# వివాహ ప్రకటన

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ రాష్ట్ర అధ్యక్షుడు **పి. సుబ్బరాజు** తన ప్రథమ కుమారుడికి వివాహము చేయదలచి ఈ దిగువ ప్రకటన ఇస్తున్నారు. ఆసక్తి గల నాస్తిక, హేతువాద, మానవవాద ఉద్యమకారులు సంప్రదించగలరు.

## వరుడి వివరాలు

| | | |
|---|---|---|
| పేరు | : | విజ్ఞాన్ |
| పుట్టిన తేది | : | 23-01-1983 |
| ఎత్తు | : | 5 అడుగుల 11 అంగుళాలు |
| బరువు | : | 75 కేజీలు |
| ఛాయ | : | తెలుపు |
| విద్యార్హత | : | బి.టెక్. (కెమికల్) |
| ఉద్యోగం | : | సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ |
| కంపెని | : | సింటెల్ - **పూనె** |
| జీతము | : | సంవత్సరానికి 4 లక్షలు |

## తల్లిదండ్రుల వివరాలు

| | | |
|---|---|---|
| తండ్రి | : | **పి. సుబ్బరాజు**<br>సీనియర్ టెలిఫోన్ సూపర్‌వైజర్<br>**పాలకొల్లు,** ప॥గో॥ జిల్లా |
| తల్లి | : | **శ్రీమతి బి. భారతి**<br>సెకండరీ గ్రేడ్ హెచ్.యం.<br>**జిన్నూరు,** ప॥గో॥ జిల్లా |

## పెండ్లికుమార్తెకు ఉండవలసిన అర్హతలు

అమ్మాయి కనీసం 5 -4 నుండి 5 -7 అంగుళాలకు మధ్య ఎత్తు కలిగి, అందంగా వుండాలి. ఇంజనీరింగ్ చదివినవారికి లేదా ఐ.టి. రంగంలో స్థిరపడినవారికి ప్రాధాన్యత. నాస్తిక, హేతువాద, మానవవాద కుటుంబాలనుంచి వస్తే మంచిది. కుల, మత, కట్న ప్రసక్తి లేదు. మతపరమైన ఆచారాలు, సంప్రదాయాలు లేకుండా వివాహం జరుగుతుంది.

సంప్రదించవలసిన ఫోన్ నెంబర్లు

**08814 - 228228** రాత్రి 7 గం॥ల నుండి ఉ॥ 8 గం॥ల వరకు

సెల్ : **94401 04181** (పగటిపూట)



51

# ప్రశ్నోత్తరాలు

**ధర్మసందేహం :** పెండ్లికి ముందు (HIV) టెస్టు చట్టబద్ధం చేయటం మానవహక్కులు ఉల్లంఘనా, కాదా ?

-ఆకేటి సూరన్న.

**సమాధానం :** మనుషుల్ని ఎవరిమానాన వారిని బ్రతకనీయకుండా నిరోధించడానికి అనావశ్యక చట్టాల అవతరణ మత వ్యవస్థలతోనే ప్రారంభమైంది. ధర్మశాస్త్రాల పేరుతో అవతరించిన స్మృతులన్నీ పాతతరం చట్టాలే. రాజరికాల అవతరణతో వాటికి మరింత బలం చేకూరింది. సమాజజీవనం చట్టాల ఉచ్చులు మానవ జీవనాన్ని దిగ్బంధనంచేస్తున్నాయి. అయినా, అవి సామాన్య జనాన్ని బంధిస్తున్నాయి కాని, ఉల్లంఘించడమే ఆచారంగా పెట్టుకున్న పాలనాధికారుల్ని, కలవారిని ఏమీచేయలేకపోతున్నాయి.

వరకట్నాలను నిషేధిస్తూ శాసనాలు చేసిన వాళ్ళంతా వరకట్నాలను ఇస్తున్నారు, పుచ్చుకుంటూన్నారు. మిగతా సామాజికులకు అది ఎబ్బెట్టుగాతోచలేదు. లంచాలను నిషేధిస్తూ శాసనాలు చేసిన వారంతా లంచాలు యిస్తున్నారు, పుచ్చుకుంటున్నారు. చివరకవి మామూళ్ళుగా పేరు మార్చుకున్నాయి. అధికారవర్గంలో ఈ లంచాల మేతకు అలవాటు పడనివాళ్ళు ఒక్కశాతంవున్నా అదిగొప్పే. కేవలం చట్టాలు నైతికతను సాధించలేవు.

పెండ్లి మనుషుల ఇస్టాయిష్టాలకు, వ్యక్తిగత జీవితానికి సంబంధించిన విషయం. అందులో చట్టాలు దూరడం నూటికి నూరుపాళ్ళు మానవహక్కుల ఉల్లంఘనే.

బాల్యవివాహాలను, బలవంతపు వివాహాలను నిషేధించిన చట్టాలు వధూవరుల యిష్టాయిష్టాలను, స్వేచ్ఛను రక్షించడానికి ఉద్దేశించబడినవే. అయినా, అవికూడా తరచు ఉల్లంఘనకు గురవుతూనేవున్నాయి.

కలవారు కొంతమంది వధువును కన్యాత్వపరీక్షకు గురిచేసే సంఘటనలు కొన్ని సినిమాలలో మనం గమనించాం. అలాంటి పరీక్షలే వరుడికి పెట్టిన దాఖలాలేవు.

నా చిన్నతనంలో వయోజనుల్లో గనేరియా రాజ్యమేలింది. పెన్సిలిన్ రాకతో అదిమటుమాయమైంది. చట్టాలతో అది ఆగివుండేది కాదు.

(HIV))ని అదుపులో పెట్టే ప్రయత్నాలే ఇప్పుడు జరుగుతున్నాయి. దాన్ని నిర్మూలించడానికి మందులు కనుగొనేయత్నాలు సాగుతున్నాయి. ఈలోగా వధూవరులకు వివాహానికిముందే (HIV) పరీక్షపెట్టాలనే ఆలోచనా వేగిరపాటుతో కూడిన నిర్ణయం. అది పెండ్లికాని యువతీ యువకుల్ని అవమానించడమే.

నిజానికి, వివాహం.వధూవరుల యిష్టానికి సంబంధించిన విషయం. వివాహానికి ముందు వారిలో (HIV) లేదని సర్టిఫైచేసినా, వివాహనంతరం అది పొడసూపేదికద్దు. వివాహానికి ముందు పరీక్షలో (HIV) వున్నదని కానీ, లేదనికానీ డాక్టర్లు సర్టిఫైచేయవచ్చును. ఉన్నవారికిలేదన్నీ, లేనివారికి ఉన్నదన్నీ సర్టిఫై చేయడానికి ఎంత డబ్బయినా ఖర్చు పెట్టడానికి సన్నద్ధులయ్యే పార్టీలున్న ఈ రోజుల్లో అలాంటి పరీక్షలు యువతీయువకుల జీవితాలకు



52

మచ్చపెట్టడానికి తప్ప, మరెందుకూ పనికిరావు. వివాహానికిముందే వైద్య పరీక్షలు అవసరం అనుకుంటే, పుంసత్వానికీ, టి.బీ.కి, బి.పీ.కి, డయోబెటీస్‌కీ ఇంకా ఇతర అవలక్షణాలకూ కూడా పరీక్ష పెట్టవలసిన వుంటుంది. అవి వధూవరుల వివాహయత్నాలకే భంగంకలిగిస్తాయి.

ప్రశ్న : **సముద్రపు నీరు ఉప్పుగా ఎందుకుంటుంది ?**

**సమాధానం :** వర్షపు నీరు నదీప్రవాహాల ద్వారా మెరకప్రాంతాల నుంచి సముద్రానికి చేరుతుంది. మెరక భూముల మీదిలవణాలను కూడా ఆ ప్రవాహాలు సముద్రంలోకి చేరుస్తాయి. ఇలా లక్షలాది సంవత్సరాల పర్యంతం సాగడంవల్ల సముద్రపునీరు ఉప్పుగా మారింది. లవణాలు ఉప్పుగా ఉంటాయికదా ? సముద్రపు నీరు ఆవిరైయినపుడు దానితోపాటు లవణాలు ఆవిరికావు. ఆ ఆవిరి మేఘాలుగా కూడి వర్షించినపుడు మరల భూమిమీది లవణాలు నదుల ద్వారా సముద్రంలోకి చేరతాయి. అంటే సముద్రపు నీటి ఉప్పదనం నిత్యమూ పెరుగుతూ ఉంటుంది. కాని వైదిక సాహిత్యంలో దీనికి వేరొక కథనాలున్నాయి. ఉదాహరణకు : గోపథబ్రాహ్మణం ప్రకారం సృష్టికర్త నీటిని సృష్టించి దానిలో తన బింబాన్ని చూచుకోవడానికి వంగాడుట. తన అందానికి తానే ముగ్ధుడైనాడోయేమో, అతని వీర్యం నీటిలో పడి, నీరు వేడెక్కి ఉప్పుగా మారిందట. అందుకే సముద్రజలం ఉప్పుగా వుంటుందట. అసలు అందమైన స్త్రీని చూస్తే బ్రహ్మకు వీర్యం పతనంకావడం, గుడ్డలు తడవడం, నేల బురదకావడం సామాన్య సంఘటనలుగా పురాణాలు వర్ణించాయి. అయినా వాటి మీద నమ్మకం చావడం లేదు.

-రావిపూడి

## అభిప్రాయ వేదికః

Dear Sri Venkatadri garu,

Thank you very much for continuously sending your 'HATUVADI' monthly journal to me as complimentary. I have received the latest issue of December also.I have read it. The articles are educative. Your personal answers to questions put to you are very interesting. Now and then I find information new to me also. The information or such information would help me in enlightening others...

Yours Sincerely,
**Jacob,**

[**Dr. C. Jacob,** B.A., B.L., Ph.D., District and Sessions Judge (Retd) Barrevari street **Narasapur- 534 275 W.G. (D.t)]**

# RADICAL HUMANIST CENTRE INKOLLU

Reg. No. 363/91

## *AIMS AND OBJECTIVES OF THE CENTRE*

The main aims and objects of Centre are :-

1. To promote the spirit of free enquiry and search for truth;
2. to inculcate the spirit of renaissance;
3. to encourage rationalist mode of thought;
4. to strive for the upliftment and liberation of women;
5. to encourage the acceptance of moral thinking and behaviour;
6. to develop the scientific and humanistic outlook;
7. to work for the brotherhood and sisterhood of the human beings transcending barriers of race, creed, caste, colour and nationality; and
8. to strive for the achievement of cosmopolitan Humanism.

**VATSAVAI NARAYANA RAJU**
President :
Radical Humanist Centre
INKOLLU-523 167
Ph : (08594) 244201

**KURRA HANUMANTHARAO**
General Secretary
Radical Humanist Centre
INKOLLU- 523 167.
Cell :99488 87122

# RATIONALIST ASSOCIATION OF INDIA

**RAI is organised to carry out and fulfill the following Aims and Objects.**

a) To Promote the spread of Rationalism and Humanism in all essentials of life.

b) To uphold human values derived from Rationalist and Humanist approach to life.

c) To adopt Rationalism as a methodology which applies reason to modern scientific and other disciplines of knowledge to arrive at the life-stance of Humanism.

d) To uphold Humanism as a life-stance that treats man as responsible for all his acts and holds that man is the maker of his own destiny.

e) To convert people to Rationalism and Humanism by persuasion and conviction and not by force or, undemocratic authoritarian means.

f) To enlighten humankind to excerise their freedom in all walks of life, transcending race, nation, caste, class and sex or any other denomination.

g) To aim at Humanocracy not as a governmental term, but as a social term and idea which strives for overall enlightenment in the people as human beings.

h) To encourage scientific out-look, to spread the philosophical consequences of modern science, and to promote the spirit of New Renaissance.

i) To maintain Securlarist, Nontheist, Physical Realist and non-sectarain stand and reject religious, obseurantist, fundamentalist, communalist and supernatural points of view.

K) To keep alive the already existing full membership of this Association in the international Humanist and Ethical Union and also its founder membership in the Indian Humanist Coordination Committee.

l) To help formation of a network of Rationalist Associations all over India, i.e., States, Union Territories, Districts, Cities, Towns and Villages etc.,

m) To publish periodicals, books, booklets and other literature for realisation of the Aims and Objects of the Association.

n) To organise meetings, symposia, seminars, study camps, training classes, lectures, conferences, conventions etc., for the promotion of the Aims and Objects of the Association.

o) To acquire, own, hold and dispose off properties

p) To accept, bequests and donations from India and Abroad for the benefit of the Association.

q) To carry out any other objectives which are not inconsistent with the Aims and Objects of the Association.

**Types of Membership**

**Patron Member Rs. 5000/-**
**Active Member Rs. 25/- p.a.**

**Life Member Rs. 2,500/-**
**Ordinary Member Rs. 10/- p.a.**

President :
**R. VENKATADRI**
Editor : Hetuvadi
Chirala - 523 157.
Ph : (08594) 233403

Gen. Secretary :
**A. BAPA RAO**
Viveka Vidyalayam
Chirala - 523 157.
Ph : (08594) - 233815

**Contribute Donations to promote rationalism and humanism**

# Hema Foundation : Chirala

**HETUVADA MANAVAVADA FOUNDATION :** Regd. No. 304/1997

A/C No. 1159 of Corporation Bank, Chirala - 523 155. (A.P.)

Hema Foundation is organised to carry out and fulfill the following Aims and Objects.

a) To Promote Rationlism and Humanism in all essentials of life.

b) To fund such publications, periodicals, organisations, centres, institutions and conventions as would serve the cause of Rationalism and Humanism and devote their attention to develop free inquiry and guard human values.

c) To finance lectures, seminars, conferences and study camps for the promotion of Rationalism and Humansim and to give awards, prizes and stipends to persons who work for spreading Rationalist and Humanist ideas.

d) To enlighten humankind to exercise their freedom in all walks of life, transcending the barriers which divide and discriminate humankind in the name of religion, race, nation, class, caste and sex or any other denomination.

e) To aim at Humanocracy not as a governmental term but as a social term which strives for overall enlightenment in the people as human beings.

f) To encourage scientific outlook and propagate the philosophical consequences of ever growing knowledge both of which promote the spirit of New Renaissance.

g) To maintain Rationalist, Humanist, Secularist, Atheist, Physical Realist (Materialist) and Non-Sectarian stand and reject religious, obscurantist, fundamentalist and communalist points of view.

h) To facilitate constructions for Rationalist and Humanist offices and centres.

i) To acquire such properties and funds as would further the cause of Rationalism and Humanism.

K) To receive such donations from India and Abroad which would permit the Hema Foundation to extend the reach of its objectives.

l) To acquire and dispose off properties for the benefit of the Foundation.

m) To carry out any other objectives which are not inconsistent with the aims and objects of the Foundation.

**Types of Membership**

Donar Member Rs. 25,000/-

Patron Member Rs. 10,000/-

Ordinary Member Rs. 5,000/-

**R. VENKATADRI**
President :
Editor : Hetuvadi
Chirala - 523 157.
Ph : (08594) 33403

**K. HARI BABU**
General Secretary
Inkollu - 523 167.
Ph : (08594) - 244410



56

ఆహ్వానం

# రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ ఇంకొల్లు

## 17వ వార్షికోత్సవం

వేదిక : **హ్యూమనిస్ట్ భవన్, ఇంకొల్లు**

తేదీలు : **ఫిబ్రవరి 9,10-2008** (శని, ఆదివారాలు)

కార్యక్రమాలు

## హేతువాద మానవవాద అధ్యయన తరగతులు

పర్యవేక్షణ : రావిపూడి వెంకటాద్రి.

చైర్మన్, భారత హేతువాద సంఘం.

**9-2-2008 ఉదయం గం॥ 09-00ల నుండి**

సభాధ్యక్షులు : **తుమ్మా భాస్కర్**, సహాయ కార్యదర్శి, ఏ.పి.ఆర్.ఏ.

అంశం : "మతం-నాస్తికత్వం"

ఉపన్యాసకులు : డా॥ జయగోపాల్, అధ్యక్షులు, భారత నాస్తిక సమాజం

షేక్ బాబు, సహాయకార్యదర్శి, ఆర్.హెచ్.సి.

**తన 87వ జన్మదిన సందర్భంగా**

**హ్యూమనిస్ట్ సెంటర్‌కు భారత హేతువాద మానవవాద సంఘాలతో**

సంబంధం గురించి

రావిపూడి వెంకటాద్రిగారి "అభిభాషణ"



57

## ఉదయం గం॥ 11-30ల నుండి

సభాధ్యక్షులు : **చుంచు శేషయ్య**
మాజీ అధ్యక్షులు, ఎ.పి.ఆర్.ఎ.

అంశం : **"మతం-హేతువాదం"**

ఉపన్యాసకులు : **పెన్మెత్స సుబ్బరాజు,**
అధ్యక్షులు, ఎ.పి.ఆర్.ఎ.

**నార్నె వెంకటసుబ్బయ్య,**
అధ్యక్షులు, ప్రకాశంజిల్లా హేతువాద సంఘం.

భోజన విరామం : గం॥ 1-00 నుండి గం॥ 2-00ల వరకు

## మధ్యాహ్నం గం॥ 2-00ల నుండి

సభాధ్యక్షులు : **కుర్రా హనుమంతరావు,**
అధ్యక్షులు ఆర్.ఎ.ఐ.

అంశం : **" విశ్వతత్వం"**

ఉపన్యాసకులు : **డా॥ డి.రాంబాబు,**
సైంటిస్ట్, డి.యమ్.ఆర్. ఎల్. హైదరాబాదు

**కరి హరిబాబు.**
ప్రధానకార్యదర్శి, హేమాఫౌండేషన్

## సాయంత్రం గం॥ 04-00ల నుండి

సభాధ్యక్షులు : **ఆలూరు ప్రఫుల్ల చంద్ర,**
మానవవాద రచయిత, తెనాలి.

అంశం : **"జీవోత్పత్తి- జీవపరిణామం- మతనమ్మకాలు"**

ఉపన్యాసకులు : **మేడూరి సత్యనారాయణ,**
ప్రధానకార్యదర్శి ఏ.పి.ఆర్.ఏ.

**గుమ్మావీరన్న,**
ఉపాధ్యక్షులు, జంటనగరాల హేతువాద సంఘం

**10-2-2008 ఉదయం గం॥ 9-00ల నుండి**

సభాధ్యక్షులు : మేదూరి సత్యనారాయణ

అంశం : "హేతువాదం-మానవవాదం"

ఉపన్యాసకులు : కుర్రా హనుమంతరావు

చుంచు శేషయ్య,

మాజీ అధ్యక్షులు, ఏ.పి.ఆర్.ఏ.

**ఉదయం గం॥ 11-30ల నుండి**

సభాధ్యక్షులు : షేక్ బాబు

అంశం : 'వాస్తు-జ్యోతిషం, బాణామతి-మంత్రతంత్రాలు'

ఉపన్యాసకులు : కుర్రా హనుమంతరావు,

మేదూరి సత్యనారాయణ,

సంకతాల రామయ్య

నల్లగొండ జిల్లా హేతువాద సంఘం.

**భోజన విరామం : గం॥ 1-00 నుండి గం॥ 2-00ల వరకు**

**మధ్యాహ్నం గం॥ 2-00ల నుండి**

## రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్

## 17వ వార్షికోత్సవ బహిరంగ సభ

సభాధ్యక్షులు : గోరంట్ల రాఘవయ్య,

ఉపాధ్యక్షులు, ఆర్.హెచ్.సి.

ఉపన్యాసకులు : రావిపూడి వెంకటాద్రి,

ఛైర్మన్, భారత హేతువాద సంఘం.

కుర్రా హనుమంతరావు.

చుంచు శేషయ్య

పెన్మెత్స సుబ్బరాజు

నార్నె వెంకట సుబ్బయ్య

తుమ్మా భాస్కర్

యం. చంద్రశేఖర్



59.

27-1-2008వ తేదీన

జరిగిన ప్రకాశం జిల్లాస్థాయి హేతువాద ప్రతిభా పోటీలలో విజేతలకు

బహుమతుల ప్రదానం : **గోరంట్ల రాఘవయ్య,**
ఉపాధ్యక్షులు, రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు

వందన సమర్పణ : **కాకి రాజశేఖర్,**
కార్యవర్గ సభ్యులు, ఆర్. హెచ్. సి.

**గం॥ 6-00లకు**

## రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ సర్వసభ్యసమావేశం.

సభాధ్యక్షులు : వత్సవాయి నారాయణరాజు

**గం॥ 7-00లకు**

భారత హేతువాద సంఘం. ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం
కార్యవర్గాల సంయుక్త సమావేశం

అధ్యక్షులు : కుర్రా హనుమంతరావు, పి. యస్. ఆర్.

వత్సవాయి నారాయణరాజు
అధ్యక్షులు, ఆర్. హెచ్. సి.

కుర్రా హనుమంతరావు
ప్రధానకార్యదర్శి, ఆర్. హెచ్. సి.

---

గమనిక : 1. చీరాల, ఒంగోలు, గుంటూరు, చిలకలూరిపేట, అద్దంకి పట్టణాల నుండి ఇంకొల్లుకు బస్సు వసతి కలదు.
2. ఈ సభల సందర్భంగా హేతువాద మానవవాద సాహిత్యం 30% రాయితీతో లభిస్తుంది.

KLVA105M245

HETUVADI February 2008
Postal Concession No.PMG/VJ/10-15/03
Registered with the Registrar of News papers No. **44832/82**



Edited, Printed and Published by Ravipudi Venkatadri and
Printed at Vasu Offset Printers, Vijayawada for Hema Printers, Chirala



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M245 |
| పుస్తకం పేరు | హేతువాదం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 64 |
| పెద్ద సైజ పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | saranya |
| స్కాన్ చేసినది | S.Hemalatha |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |